# నూ ర్జ హా న్

[ నా ట కం ]


ర చ యి త :

## కొప్పరపు సుబ్బారావు

“ క్రోషనార ” , “ నేటినటుడు వగైరా ” , “ తారాశశాంకం ” , “ వసంతసేన ”
ఇత్యాది నాటకరచయిత



ప్ర కా శ కు లు :

## ది మోడరన్ పబ్లిషర్సు (రిజిష్టర్డు)

హెడ్డాఫీసు : తెనాలి - బ్రాంచి : విజయవాడ.





1 9 4 8

[ వెల రు 1—8—0

# ★ పాత్రలు ★

## —: పురుషులు :—

| | |
|---|---|
| జహాంగీరు | మొగల్ పాదుషా |
| షేర్ ఖాన్ | మెహెర్ భర్త |
| ఖుస్రూ | జహాంగీరు పెద్దకొడుకు |
| షాజహాన్ | ,, రెండవ ,, |
| షహార్యార్ | ,, నాల్గో ,, |
| మహాబత్ | మొగల్ సేనాధిపతి |
| మీర్జా | ఖజాంచి, మెహెర్ తండ్రి |
| ఆసఫ్ | మీర్జాకొడుకు |
| సంగ్రామ్ | జహాంగీరు అంతరంగికుడు |
| వంది | భట్టు |
| మాగధుడు | భట్టు |
| కైలైసాబ్ | పఠాను బాటసారి |
| రణసింగ్ | రజపుత్ సర్దారు |

## —: స్త్రీలు :—

| | |
|---|---|
| మెహెర్ | నూర్జహాన్ |
| లైలా | మెహెర్ కొమార్తె |
| జోధపురి | జహాంగీరు పట్టమహిషి |
| మాతి | దాసి |

సామంతులు, దండనాథులు

నర్తకులు, హంతకులు మొదలగువారు

# అంకం ఒకటి

## రంగం ఒకటి

---

వందిమాగధుల ప్రశస్తి చదువుతుండగా తెర మెల్లిదిగా పైకి పోతూవుంటుంది రంగంమీద మిర్జాగయాస్, ఆసఫ్‌ఖాన్, సంగ్రాం, సామంతులు మొదలగువారు బాదుషాహ కోసం నిరీక్షిస్తూ కనబడుతారు — మోకీకూడావుంది.

వంది — హింద్ కా అఖండ్ సమ్రాట్ ఆరహే హైఁ! హోషియార్!

మాగ — కర్తుం, అకర్తుం, అన్యథాకర్తుం, సమర్థ శక్తిమాన్ ఆరహే హైఁ, హోషియార్.

వంది — తైమూర్ లంగ్ రాజవంశ రత్నాకర్ కే పైదా హువా ధగ్‌ధగ జ్యోతిపుంజ్ కా రాశీ ఆరహే హైఁ! హోషియార్!

మాగ — ఇరాన్, తురాన్, ఇస్ఫహాన్, ఉదేపూర్, జోధపూర్, జస్సల్‌మీర్ ఇత్యాది శతసహస్ర మండలాధీశ్వర్ కా అధీశ్వర్ ఆరహే హైఁ! హోషియార్!

వంది — ఒర్మెఫీమ్, దాస్మేకర్ణ్, మూష్మేశసంగ్, దుష్మనోంకేభుజంగ్, జంగ్ మైదాన్మేసింగ్, ఆరహే హైఁ! బజావో భేరీమృదంగ్, బజావ్!

తూర్యారవాంతో జహంగీరు ప్రవేశం. పరధ్యానంలో గాఢంగా నిమగ్నుడై ఉన్నట్లు జహంగీరు వైఖరి చెప్పక చెబుతున్నది. అతడు సింహాసనంమీద కూర్చున్న వెంటనే ఆసఫ్‌ఖాన్ ఈదిగువ పద్యం చదువుతాడు. పద్యభావానికి అనురూపంగా దాసీలు ఆయా కానుకలు తీసుకవస్తారు,

ఆసఫ్ - సీ. శ్రీ శ్రీ యఖండకీర్తి క్రాంత కకుబంత!
కాంధహారంపిన కాన్కలివిగో!
శిల్ప, గాన, కవిత్వ, చిత్రకళోద్ధార
కాశ్మీర మంపిన కప్పమిదిగో!
జయదుందుభిధ్వాన చకిత శాత్రవలోక
లంకయర్పించిన సుంకమదిగో!
ఆసేతుశీతనగాన్విత! ఈరాన్ తు
రానులంపిన నజరాన లవిగో!

హిందుముస్లిము సంధాన హితవిధాన!
చల్లనగు నీదుపాలన నుల్లసిల్లి
హైందవ ప్రజ 'జై'! 'జై'! జహాంగిరనుచు -
కోటివాక్కుల నినదించు ఘోషయదిగో!

(అంతా "జై" బాదుషాకు. "జై" అంటారు)

మీర్జా—జహాఁపనా! విలాయతీసాబ్ తమదర్శనార్థం వేచియున్నారు.

జహాన్—విలాయతీసాబ్? కౌన్ హై విలాయితీసాబ్?

మీర్జా—ప్రపంచ పర్యటనంచేస్తూ ఈ హిందూ దేశంవచ్చి తమదర్శనానికై ఎదురు చూస్తున్న (ఫ్రాన్స్) దేష్ వాలా మన్సూర్ కెలై.

జహాన్—హాఁ హాఁ కెలై సాబ్ ఫరాఁస్ ఖాన్ అచ్ఛా. ఆసఫ్! తుంజావ్ ఉస్ ఫరాఁసీకో అందర్ భేజో!

(ఆసఫ్ నిష్క్రమణము)

జహాన్—మీర్జా!

మీర్జా—జో హుకుం ఖుదావంద్!

జహాన్—నీ అల్లుడు-మహావీరుడు-వనషేర్ ఖాన్-ఎట్లున్నాడు? గాయాలు మానినవా?

మీర్జా—ఇంకను పూర్తిగా మానలేదు.

జహాన్—పాపము! పొత్తుగా లేవలేని స్థితిలోలేదుకదా. దర్బారుకు రాగలడా?

మీర్జా—దేవర చిత్తము.

జహాన్—మాకు వినోదార్థం మేము కోరిన వెంటనే పెద్దపులితో ద్వంద్వయుద్ధం చేసి అఖండ విజయం పొందిన అతని అనన్య బలపరాక్రమాలకు ఆగ్రానగరమంతా హాహాకారం చేసింది. షేర్ ఖాను ఎన్నోవిధాల ధన్యజీవుడు సుమా.

మీర్జా—(ధ్వని అర్థమైనప్పటికీ దలించకుండా) కావచ్చును.

జహాన్—(రానినవ్వు తెచ్చుకుంటూ) ఔను మన షేర్ ఖాను అన్నివిధాలా ధన్యజీవుడే. అతణ్ణి ఈక్షణంలో మా సన్నిధికి రప్పించి, కౌగిలించి, ప్రశంసించి మా ఆనందాన్ని అమోఘాగ్రంగా వెల్లడించవలెనన్నంత గాఢ కుతూహలం మాకు కలిగింది. — మీర్జా! నీవుపోయి షేర్ ఖానును రమ్మని చెప్పుదువా?

మీర్జా—ఆజ్ఞయా?

జహాన్—మన షేర్ ఖానుకు ఆజ్ఞయా! ఆజ్ఞ కాదు. "ఆహ్వానము" అనిచెప్పు!

(మీర్జా అనిష్టంగా నిష్క్రమణం)

జహాన్—(అక్కడివైపుకే ఏకదృష్టితో కొంతసేపు చూచి నిట్టూర్పువిడిచి) సంగ్రాం!

సంగ్రాం—జోహుకుం ఖుదావంద్ !

జహాన్—మొదటి ప్రయత్నం వృథా అయింది !—పెద్దపులియే ఓడింది ! షేర్‌ఖాన్ గెల్చాడు ! సంతోషమే ! కానీ—

సంగ్రాం—అయినట్టు ఇంతటి అదృష్టమయితే దేవతారి ఇంకానంతో షరాగా వుండేది !

జహాన్—కానీ—రెండో యత్నమైనా వృథా కాకుండా, తగిన ఏర్పాట్లన్నీ మెలకువతో చేశావా ?

సంగ్రాం—చేశాను సమ్రాట్ !

జహాన్—ఏనుగును సిద్ధపరచావా ?

సంగ్రాం—(నేపథ్యంవైపు చూపిస్తూ) అదిగో సమ్రాట్ ! ఆగ్రానగరమంతా గాలించి, గాలించి మొరటిరకం నల్ల మదపుటేనుగును పట్టి తెచ్చా !

జహాన్—మంచిది. మావటీవాడు ?

సంగ్రాం—అదుగో, ఏనుగుమీద నలుపులో నలుపు కలిసిపోయి కనబడుటలేదు !

జహాన్—ఎవడువాడు ?

సంగ్రాం—హబ్షీ దేశస్థుడు కటికకసాయి అరవుగుంపాదుల వాళ్లందుగులమందం మొత్తం మాకుదున్నల బరువు వుంటాడు సమ్రాట్ !

జహాన్—బరువు నీకూవుంది ! — కానీ, ఈ రెండో ప్రయత్నానికి అనుకున్న ఫలితం కనపడకపోతే మూడు నీబరువు – – – – జాగ్రత్త !

సంగ్రాం—చిత్తం చిత్తం !

జహాన్—మావటివానితో ముందుగా చెప్పితివా ?

సంగ్రాం—ఆ ! పదివేల అషర్ఫీలు బహుమానం ఇప్పిస్తానని ఆశపెట్టాను. ఇక సందేహమెందుకు సమ్రాట్ ! షేర్‌ఖానును ఆ హస్తి విడిచినా ఆ హబ్షీ విడుచుట కల్ల !—కాని జహాంపనా ! నాకు ఒకఆలోచన కలిగింది.

జహాన్—ఏమిటది ?

సంగ్రాం—షేర్‌ఖానును చంపకుండానే, ఈ వ్యాపారం ఎందుకు బహిష్కారం చేసుకోకూడదు ?

జహాన్—అది ఎట్లుసంభవం ?

సంగ్రాం—అన్ని వ్యాపారాలవలెనే అడు దానితో సంబంధించిన వ్యాపారంకూడ ఒక్కొక్కప్పుడు బేరానికి తెగవచ్చు !

జహాఁ—అంటే !

సంగ్రాం—అంటే ? షేర్‌ఖాన్‌వద్ద ఒక అమూల్యమైన, అలోక సుందరమైన వస్తువు ఉంది. ఆ వస్తువును తమయిచ్చి వచ్చిన ధరకట్టి అతడు మీకేల విక్రయం చేయకూడదు.

జహాఁ—మూర్ఖుడా ! షేర్‌ఖాన్‌వంటి వీరుడు అట్టిపనికి ఒడంబడునా ?

సంగ్రాం—ఆశ అనేది ఒక్కొక్కప్పుడు ఏలాంటి పనైనా చేయిస్తుంది. షేర్‌ఖాను యువకుడు, ఆశాపరుడు, ఇప్పుడు చిన్న నౌకరీలో వున్నాడు. దేవరకృతజ్ఞతను ఆర్జించుకుంటే అతడు మన్సబ్‌దారే కాదు, సుబేదారే కాదు, చివరకు మొగలాయి సైన్యానికంతా నాయకీ బహద్దర్ కావచ్చు.

జహాఁ—సరే మంచిది. నీ వుపాయంకూడా సమంజసంగానే వుంది. కాని-ఇప్పుడు కాదు. ఈ రెండో యత్నంకూడా నిష్ఫలం అయితే, నీ వుపాయాన్ని మూడో యత్నంగా నీవే వుపయోగించి చూతువుగాని.

సంగ్రాం—జోహుకుం ఖుదావంద్ !

వంది—జహాఁపనా ! కైలై దొరగారు తమయాజ్ఞకు నిరీక్షిస్తున్నారు.

జహాఁ—లే ఆవ్ !

(వంది నిష్క్రమణం)

జహాఁ—రాజా! ఈ కైలైను ఎందుకు పిలిపించానో నీకు తెలుసునా ? షేర్‌ఖాన్ వంటివీరులు భారతదేశంలో ఉన్నారని చూపించుటకే !

సంగ్రాం—ఔను ! దేవర ఉద్దేశాలు, దేవతా ఉద్దేశాలే !

(వంది వెంట కైలై ప్రవేశం)

కైలై—Good Morning to Your Majesty!

జహాఁ—హ హ హ_జనాబ్ కైలై—ఆయియే—ఎక్షీ !

(మోతి చెరిమొక మధుపాత్ర అందిస్తుంది.)

జహాఁ—(మధువు అందుతూ) కైలైసాబ్! మీరాజ్యంలోవున్న చిత్రకారుల సాటి యేరాజ్యంలోనూ లేరని, ఒకనాడు మీరు సగర్వంగా చెబుతూ, నిదర్శనంగా ఒక చిత్రపటం నాకు బహూమానం చేశారు జ్ఞాపకం వుందా ?

కైలై—yes ! yes !

జహాఁ—ఏదీ ! (మోతి ఒక దంతపుపెట్టె అందిస్తుంది దాన్ని తెరుస్తూ) మీరిచ్చిన ఆ చిత్రపటానికి నా చిత్రకారులచేత నాలుగు నకళ్లు వ్రాయించాను చూడండి

కైలై—(చూచి ఆశ్చర్యపడతాడు)

జహాఁ__ఆ ఆయింటింటిలో మీరిచ్చిన మూర్తుక ఏవోగుర్తింపగలరా ?

కెలై—Good Gracious! ఏమూర్తుక ? ఏమి ఆకారం ? అన్నిమూర్తు కల వలెనే వున్నవి.

జహాఁ__హాహాహా! కిహిసే! కాఁబడా ? తుమ్‌హాకేలియాయిహీ యా హమారీ భారత్ వర్షకా చిత్రకాన్ ? కెలైసాబ్! ఈ భారతవర్షం ప్రపంచానికంతా కళాపీఠం.

కెలై—Why?

జహాఁ__గర్వోక్తి కాదు చూడండి!

సీ. తిలకించు! మంచుకొండల తెల్లని పంక్తి హిమాలయనాధవళగిరుల—
పఠియించు! రాజపుత్రుల నాక ప్రతిమలై నిలచిన పరమాత్మ జీవనముల—
అరయుమా! మరగుజ్జు నరజాతి కరిగించి తలలెత్తిన వృక్షముత్తాల తరుల—
కను! మింట్రకధను పేపుగట్ల కలంకారి రంగులద్దిన మేటి నింగిచీర!
ఇట్టి సుందరదృశ్య మెందేని కలదె!
ఇట్టి భూతల స్వర్గ మెందేనికలదె!
ప్రకృతి స్వయముగ నులిచికేంబట్టి, తీర్చి దిద్దిచెక్కిన బొమ్మ యీ దివ్యభూమి!

వంతి__జహాఁపనా! మంత్రిజీ, షేర్‌ఖాఁజీ వస్తున్నారు! (మీర్జా, షేర్‌ఖాఁ ప్రవేశం)

జహాఁ__ఆవో షేర్‌ఖాఁ!__ఆవో! మేరేప్యార్! మేరేవీర్ షేర్‌ఖాన్

షేర్—(బందగీచేస్తాడు.)

జహాన్—కెలైసాబ్! పెద్దపులితో భయంకర తుకాసంగ్రామంచేసి అఖండ విజయం పొందిన ఇటువంటి మహావీరుడు మీదేశంలో వున్నాడా ?

కెలై__క్షమాట్! మాదేశంలో పెద్దపులులేలేవు. కాని గ్రీకుదేశంలో హెర్క్యులీస్ అనే ఒక ప్రచండ బలశాలివుండేవాడనీ, అతడు ఒకప్పుడు ఖడ్గమృగంతో మల్లయుద్ధం చేసి దాన్ని తునాతునకలుగా చెండాడనీ పురాణాలలో చదివిన జ్ఞాపకం ఉంది.

జహాంగీ—హా హా హా ఖడ్గసృగమా! ఇంతేనా! అసహ్యమైనా పురాణగోష్టి

సంగ్రాం—జహాంపనా! ఖడ్గసృగంకంటె ఏనుగును చంపడం ఎక్కువకష్టం సుమండీ!

జహాంగీ—ఎవరికి?—మనషేర్‌ఖాన్‌వంటి వీరునకా?

సంగ్రాం—కాదు హెర్క్యులీస్‌కి! మన షేర్‌ఖానును ఈ మర్త్యలోకంలో వున్న యేనుగే కాదు. ఇంద్రలోకంలోవున్న ఐరావతమైనా జోహారు చేయవలసిందే!

జహాంగీ—షేర్‌ఖాన్!

షేర్—జోహారుకుంఖుదావంద్!

జహాంగీ—నీవు పెద్దపులితో పోరాడిన అద్భుత దృశ్యాన్ని ఈ కెప్టెన్‌సాబ్‌కు చూపజాలక పోతిని. ఇప్పుడు నిన్ను ఏనుగుతో పోరాడించి వీరికి ప్రత్యక్షంగా చూపించవలెనని మాకు గాఢమైన అభిలాషకలిగింది!

షేర్—దేవరయాజ్ఞ!

జహాంగీ—ఆహా వీరలక్షణం! సంగ్రాం! పోయి ఒక ఏనుగును సిద్ధంచేయుము?

సంగ్రాం—ఆదేశం జహాంపనా! (నిష్క్రమణం)

కెప్టె—సమ్రాట్! గాయాలు యింకా మానలేదు. పాపం! వెంటనేమరల ఏనుగుతో పోరాడించుట న్యాయము కాదు.

మీర్జా—జహాంపనా! ఒక్కమనవి.

జహాంగీ—క్యాహై?

మీర్జా—పెద్దపులితో పోరాడి రెండు దినములైనాగడవలేదు, దాని పంజాగాయములు ఇంకా పచ్చిగనే వున్నవి. ఇప్పుడు మరల ఏనుగుతో పోరాటం! ఈ శూరవాని శ్రేయస్సు సమ్రాట్ కోరినయెడల ఈ పోరాటం ఈనాటికి ఆపించవలెనని నామనవి.

కెప్టె—ఔను. నామనవికూడాఅదే!

షేర్—జహాంపనా! పెద్దపులితో పోరాడి నేనుఎంత అలసియున్నా, మీకు ఆనందం సమకూర్చవలెననే ఉత్సాహం నాబడలికనంతయూ మరపించినది ఆజ్ఞ!

జహాంగీ—బడీబాత్‌హై! బడీబాత్‌హై! ఐసాలాయఖ్ యోద్ధోంసబ్‌నే తుమ్ వీరాధివీర్ హో షేర్‌ఖాన్!

సంగ్రాం—(ప్రవేశించి) జహాంపనా! ఏనుగు ఆదిగో సిద్ధంగా వుంది.

జహాంగీ—షేర్‌ఖాన్!

షేర్—(కత్తిచూపి) జయ్‌హో! జహాంగీర్ బాదుషాకీ జయ్‌హో (నిష్క్రమణం)

క్లైవ్ మనసు అల్లకల్లోలంగా వుంది — మీర్జామనసు తుఫాన్‌లో కొట్టుకు పోతుంది — తెరలో పోరాటం ఆరంభమైంది —

సంగ్రాం — అదిగో ! తొండంతో మెలివేసి గట్టిగాపట్టుకుంది ! అయ్యో ! అయ్యో ! — ఆ — తప్పించుకుంటున్నాడు.

క్లైవ్ — Ah ! there ! there ! హోషియార్ ! షేర్‌ఖాన్ ! హోషియార్ That's Right ! That's Right ! Glorious !

సంగ్రాం — తొండాన్ని తోటకూర కాడవలె తునాతునకలు చేశాడు సమ్రాట్ !

జహాన్ — బహాదురుస్తుంహై ! బహాదురుస్తుంహై !

సంగ్రాం — అదిగో ! అమ్మయ్యో ! ఈసారి కాళ్ళతో ఇరికించు కుంటున్నది! అదిగో ! అయ్యో ! అయ్యో !

మీర్జా — జహాఁపనా ! కాలికింద నలిగిపోతున్నాడు ! చూడండి ! చూడండి అయ్యో ! అయ్యో ! దయచేసి పోరాటం ఆపించండి !

సంగ్రాం — అరెరే ! తప్పించు కున్నాడే ? — బలే ! బలే ! కాలును చొప్ప కట్టను నరికినట్లు రెండు ముక్కలుగా చేశాడు.

క్లైవ్ — Wonderful ! Wonderful !

సంగ్రాం — శాబ్బాష్ ! వీరావేశంతో ఎగిరి ఏనుగమీదికిదూకి దానితలను కత్తితో అడుగంట తెగ్వేస్తున్నాడు సమ్రాట్ !

క్లైవ్ — Treachery ! Treachery ! మోసం ! ఆ మావటివాడు చూడు ! వెనుకనుంచి కత్తిదూస్తు తున్నాడు ! I will shoot that nigger ;

మీర్జా — ఇంక అన్యాయమా ?

క్లైవ్ — షేర్‌ఖాన్ ! మావటివాడు జాగ్రత ! — ఆ ! Right ! That's right ! Dispatch him to the Devil ! Right !Glorious !

సంగ్రాం — మావటివాడు చచ్చి క్రిందకు దొర్లాడు. ఏనుగుచచ్చి విల్లిలా పడ్డది. ఇంకేవుంది ! కథ కలాస్ !

మీర్జా — (పెద్ద నిట్టూర్పుతో) అల్లా ! తుమ్హీహో రక్షక్ ! తుమ్హీహో రక్షక్ !

(రక్త సిక్తాంగంతో షేర్‌ఖాన్ ప్రవేశిస్తూ)

షేర్ — జయ్‌హో ! మేరేస్వామి జహాంగీర్ బాద్‌షాకీ జయ్‌హో!

జహాంగీరు తన మెడలోని పతకము అతని మెడలో వేసి, వీపుకొట్టి నిశ్శబ్దంగా వెళ్ళిపోతాడు.

కాలై— షేర్‌ఖాన్! నీవంటి యోధుణ్ణి కన్న ప్రేమతో నాభూమాత ఎంతపులకరిస్తున్నదో. (నిష్క్రమణం)

మీర్జా— (జహంగీరు వెంటవెళ్తూ) బేటా! నేను బాదుషాను పంపించి నీకోసం పల్లకితో ద్వారంవద్ద సిద్ధంగావుంటా! (అంటూ నిష్క్రమణం)

(షేర్‌ఖాన్ కూడా వెళ్ళబోతూంటే)

సంగ్రాం— షేర్‌ఖాన్!

షేర్— (ఆగును)

సంగ్రాం— సామ్రాట్టుకు నీమీదవున్నంత ఆదరం, అభిమానం, అనురాగం తనకొలువులోవున్న ఏ యితర ఉద్యోగి మీద కూడా సభలో, సభవిస్మృతి, అనినాకు ప్రచండమైన అనుమానం.

షేర్— నీ సదభిప్రాయానికి నాసలాములు.

సంగ్రాం— షేర్‌ఖాన్! ఆయనకు నీపైగల అనురక్తియే గొప్పదో - నీకుఆయన యెడలగల రాజభక్తియే గొప్పదో నిర్ణయింపగల ఏదైనా ఒక వినూత్న ఘట్టం తటస్థించిన యెడల ఏమిజరుగునో!

షేర్— (మాట్లాడడు)

సంగ్రాం— ఆహాహా! అట్టి సమ్రాట్టుకోసం నీవంటి రాజభక్తిపరుడు చేయజాలని స్వార్థత్యాగమేలేదు! అట్టి రాజభక్తిపరుపై ఆ సమ్రాట్టు వర్షింపజాలని ధనధాన్య మణి కనక వస్తువాహన బిరుద లాంఛనములూలేవు. షేర్‌ఖాన్! ఏమంటావ్?

షేర్— నీ ప్రసంగం వీనుల విందుగా వుంది

సంగ్రాం— ఇంతయేల అట్టిస్వార్థత్యాగం ఒకటి నీవల్ల కావాలిఅని ఆసమ్రాట్టు ఆ జీవితవాంఛ ఇట్లే ఒక్కసారి మాచాయగా అంటేచాలు, నీవంటియోధుడు ఏత్యాగమైనా చేస్తాడు. పంచాగ్ని మధ్యంలో అహోరాత్రం పడివున్నాన్నా, ధవళశిఖరాగ్రంనుండి గుభాలున దూకమన్నా, లేక తన మనస్సును హరించిన ఎట్టి వస్తువును కోరినా, వస్తువునే కాదు, ప్రాణమిత్రులను, ఆప్తబంధువులను, తల్లిని, తండ్రిని, అన్నలను, తమ్ములను, కొడుకులను, మాటవరుసకు ప్రాణ సమానయైన భార్యనైనాసరే—

షేర్— అధముడా! ఆపు నీ అసభ్యప్రసంగం.

సంగ్రాం— కాదు షేర్‌ఖాన్! రాజభక్తి—

షేర్— భక్తి? ఇదేనా నీరాజభక్తి? గ్రహించా. నీవు నీరాణాసాహెబ్ బిరుదమును సమ్రాట్‌వల్ల అట్టే ఆర్జించియుందువని ఇప్పుడు విస్పష్టమైంది, తుచ్ఛుడా!

చ. పదములు పాడి యేలికలపై, బిరుదుల్ గొనకేర్చు బట్టుకున్
చెవుల రాజభక్తి; యెద పీసము తగ్గని స్వార్థసక్తి; లో
నుదరముపైన రక్తి; వెకిలో జగదుద్ధరణ ప్రసక్తి; యీ
చదువులు సెప్పు నీ బ్రతుకు చందమెరింగితి బాలిశాధమా!

సంగ్రాం—(ఒరమీద చేయివేసి) షేర్ ఖాన్ !

షేర్—(తానుకూడా కత్తి సెమ్మదిగా దూస్తూ) బిరుదులగులాం ! నీకు కత్తి కూడ ఉన్నదా, ఇదిగో నీహస్తిని నీహస్తిని కంపతుండేముఖంగా చెండాడిన ఈ ఖడ్గంతో ఇంకనూ నృత్యంచేస్తుంది షేర్ ఖాన్ ఖడ్గం రా ! రావేమి ? —

సంగ్రాం—(కంపం పుట్టగా ఒరనుండి చేయితీసి వేళాకం) షేర్ ఖాన్ ! నీవు రౌద్రుడ వేయని నేనెప్పుడూ మెచ్చుకుంటా.

షేర్—ఛీ ! పిరికిపందా (కత్తిని ఒరలో పెడుతూ) నీపేరు సంగ్రామ సింహుడు కామా! ఈ పేరు పెట్టిన నీతలిదండ్రులు పాపం ఎంత అమాయికులు ! నీవు సంగ్రామ సింహుడవు కాదు. గ్రామసింహుడవు. (నిష్క్రమణ)

సంగ్రాం—ఏమీ ! గ్రా—మ—సిం—హు—డ్నా !

(తెర)

## రంగం రెండు

(వీధి. వందిమాగధులు ప్రవేశం)

మాగ—క్యారే వందీ !

వంది—అరే ! హమ్ కో క్యా రేవంసీహాని పెప్తారే మాగీ ! నీకేపిల్చి నిన్నగాక మొన్న మేం హిప్పించాం నౌకరీ !

మాగ—రే! రే ! మర్చిపోయా- మాఫ్ కరో! మరీ నీకే హాం హనాలా? -అచ్ఛా జనాబ్ వందీ పాద్షా మహరాజ్ !

వంది—ఒరే ! చుప్ ! కొంపాద్‌షా !—బాప్రే ! అస్సల్ పాద్‌షాహినాన్నయితో పుచ్చుల్ హాంతా పచ్చడీ హైతాది !

మాగ—హాఁ ! హాఁ ! అచ్ఛా ! అయితే !—క్యా రేవందీ !—అర్ ర్ ర్ ర్

వంది—క్యాబే మాగధ్ !

మాగ—ఓపాదుషా హంతోబే కార్ పని చేశాడుక్యాం ?

వంది—క్యాహై వో !

మాగ—ఓ షేర్‌ఖాన్‌కా గల్లామే హార్ దాల్‌కే చుప్కే గయా ! ఎట్లకీభీ కూడా మాటసెప్పలేద్ !

వంది—వాది వుండాదిలే దేవతారహస్యం.

మాగ—అరె ! మాకీభీ కొంచెం తెల్సు—ఓ షేర్‌ఖాన్‌కా ఏక్ పోడ్యాడ్ హై ఉన్కీ నాం మెహరున్నిస్సాహై, ఓ బడీ అందచందంకే వాం సునా! ఓ పోడ్యాడ్ పర్ బాదుషాకీ జ్వరా—హి—హిహి—

వంది—జ్వరా కామారే-పూరా వుంది.

మాగ-భాయీ ! ఓ మెహరున్నిసాకు పాదుషా ఎప్పుడు సూశాడ్ ? ఎల్లా సూశాడ్ !

వంది—పదిమూడు పారసమత్సరాల్ కింద-ఎప్పుడా మెహరున్నిసాకు ఫెండ్లికాలేద్ ఎట్లకీగ్ జనానాలో బడీనాచ్ వచ్చీగా జర్గింది. వాడ్డా అగ్బర్ పాదుషా వున్నాడ్-షేర్ సలీం, అంటే జహాంగీర్ భీ వున్నాడ్.

మాగ—ఫిర్ క్యాహువా ?

వంది—వాడ్డా ఓ మెహరున్నిసా సేసింది వొట్టేనాచ్ - పాడింది ఎట్లేపాట వాడినూసి జహాంగీర్ సాబ్ ఏక్‌దమ్ దివానాహోగయా.

మాగ—ఫిర్ ఓ మెహరున్నిసాను ఫట్కాని జహాంగీర్ పెండ్లి సేస్కోలే క్యో?

వంది—సేస్కోవాలా అని జిడ్డీఖుషీ సేశాడ్. మగర్ మెహరున్నిసా మాఫిక్ గరీబ్ బేటీ లోడల్ హైతే పాదుషాకు పరువు నష్టంవాసీ, ఓ అగ్బర్ జహాంగీర్కో దబాయించి ఓ మెహరున్నిసాను షేర్‌ఖాన్‌కిచ్చి నిఖాసేసి, పిద్దర్నిపట్టి ఆగ్రానుంచి బర్ద్వాన్‌కు తోసిపారేశాడ్. జోధ్‌పుర్ బాయికీ తెచ్చి జహాంగీర్కూ నిఖాసేశాడ్.

మాగ—అరెరె ! ఇద్దారు సమత్సరాల్ గడ్సిపోయినా ఓ పాదుషాకు మెహరున్నిసామీద పెర్మ బడీ గర్మాగరంమే వుంటాదే!

వంది—పోరా!—మురికెట్టు ఎట్లకీ, మస్సిరేమా ఎట్లకీ, తల్లిదరుపట్టి పెల్లించక పోతే, ఉన్నాకొద్దీ హవుడల్ పెట్టి, కన్నుమిన్ను కప్పేస్తాదిలే !

మాగ—క్యారే ? ఓ మెహరున్నిసాకుభీ పాదుషామీద పెర్మావుండాదా ? లేదా ?

వంది—అరే హాడ్యాడ్కీ మన్సె హేంవుండాదో వాళ్లకే తెల్సు !

(అప్పుడు రొనరొనలాడుతూ మోతీప్రవేశం)

మోతి—(మాగధుణ్ణి చెవిపట్టుకొని త్రుళ్ళిచేస్తూ, ఇక్కడ మిరుకుపూ ఇకా సన్ప్య చేస్తున్నావు ? నడిబజారులో అంతఃపుర రహస్యాలన్నీ ఆలాపన చేస్తున్నావా ? అయ్యో ! అయ్యో ! గూఢచారులెవరైనా వింటే కొంపమునిగిపోతుందే !

వంది—హాఁ ఎంత పిచ్చాకదం! నీ కుఁపడీ హాలు హాంతా గట్టివుందో, లేకపోతే కంఫాన్కి ఘాట్టువుందో హాకీ నాకుఁదేహిప్పిం చినందుకు నాకీఫీసిచ్చ హైతాఁ. మగర్ మోతీబాయ్ ! హి హి హి ! నీనయా భోంచో చూకీయానవుంటే, నిచ్చాభీరాని నచ్చీ పోతా. —

మోతి—నోరుకట్టిపెట్టు. నా మొగుడు షేక్‌ఖాన్‌వంటి వీరుడు కాకపోయినా నీజహాంగీరుతనం మటుకు నావద్గరసాగదు. వింటున్నావా ? కదిష్ నాక్ ! — రా ఇంటికి పోదాం ! (అంటూ మాగధునితో నిష్క్రమణం)

వంది—బాప్రే ! హిమోతీసూస్తే మంచిహాందమైన పుష్ప • క్యాహాయిబా ! హీ పుష్పగో హాందం వుండిగాం గండంలేదు !

(అదిపోవుచుండగా సంగ్రామసింహుడు ఎదురుగా ప్రవేశం)

సంగ్రాం—వంది !

వంది—హాఁ రాజాసాహెబ్ ! సలాం ! సలాం !

సంగ్రాం—నీవు ఉర్దూలోను సంస్కృతంలోను మాంచి పండితుడవట ?

వంది—హాఁ సర్కార్ ! మాబట్టాజా హాక్మతాంతా ఒకీ పండిత్ హై ! మా నాయన హుర్దూలో మాతాత సమ్మన్సుకతంలో బడీ పైల్వాన్ హై !

సంగ్రాం—పైల్వాన్ ! ?

వంది—హా ! సర్కార్ ! హొంతా హొంతా మౌల్వీవచ్చి, హొంతా హొంతా పండిత్ వచ్చి, హొంతా హొంతా పరీచ్చా సేసినా మానాయనామాతాతాహాళ్కి ముక్క ఘటాన్ని మూడంగలితాలు హిస్తే, తర్కం గిర్కం ఛోడేకేవాస్ తీనేవాళ్లు సర్కార్ ! హాఁ !

సంగ్రాం—అయితే నీవంటి పండితపుత్రుడు ఇక్కడవుండగా ఊరంతా అవవస రంగా వెతికాను సుమా.

వంది—అప్కా క్యాహోనా సర్కార్ ?

సంగ్రాం—వచ్చింది, నీపాండిత్యానికి పరీక్షాసమయం వచ్చింది ! కానుకోమరి. 'గ్రామసింహ' మనేపదం ఏభాష ? దానికి అర్థమేమిటి ?

వంది—గ్రాంషింహం ? ! అర్ర్ ! హిదీ దేవతా భాషాఅండీ !

సంగ్రాం—గొప్పభావమేనా ! నేనూ అలాగే అనుకున్నానుమా ! కాని,— ఆమాటకు అర్ధంఏమిటి ?

వంది—అరదం ? గ్రామాన్కి సింహంవంటివాడు గ్రాంసింగోజీ !

సంగ్రాం—హిహిహి ! భేష్ ! భేష్ !—కాని-చూడు- గ్రామాల్లో ఎక్కడైనా సింహాలు ఉంటాయా ? నేనెక్కడా చూడలేదు.

వంది—ఇంకా పారదం కాలేదా సర్కార్ ?

సంగ్రాం—కాలేదు-అంటే-మరి-

వంది—అచ్ఛా ! సునోసర్కార్ ! అస్సల్ సింహం అడ్విలోవుండే జంగ్లీ-హికి సింహం గ్రామంలో తిర్గే ఘరానా. హాకి మన్సికీనూస్తే మర్యాదలేని మూతితెరిసి పళ్ళు చూపిస్తాది. హిడీ మన్సికినూసి మర్యాదసేవి తోకఆడిస్తాది.

సంగ్రాం—తోక ! ?

వంది—హాఁసర్కార్ !

సంగ్రాం—అరెరే ! — ఇదా ! — కుక్క ?

వంది—కుక్క కాదు సర్కార్ ! — షుక్కం ! భైరవ్ !

సంగ్రాం—(ఒరలోకత్తిమీద దర్జాగాచేయివెట్టి) హూః ! —ఓరీషేర్‌ఖాన్

వంది—క్యాహువాసర్కార్ ! ఓషేర్‌ఖాన్ రాజాసాహేబ్కు ఫట్కాని హింతమాట అన్నాడువాండీ ?

సంగ్రాం—నన్నా ? — అబ్బే ! — నన్నుఆంతమాట అనడమే ! — నన్ను కాదు—మరి—

వంది—మేం హోవరితోనూ చెప్పంలెండి సర్కార్ !

సంగ్రాం—అబ్బెబ్బెబ్బే ! నన్ను కాదు. నామీదకోపంచేత నాతమ్ముణ్ణి అన్నాడట !

వంది—మీకీతమ్ముడు హెక్కడవుండాడ్ సర్కార్ !

సంగ్రాం—ఉన్నాడు. చాలాదూరదేశంలో వున్నాడు. నిన్నపొద్దున్నేవచ్చి మధ్యాన్నమే వెళ్లిపోయాడు. వెళ్లనియ్ ! అతని అన్నను నేనులేనాయిక్కడ ? ఈఅవమానాన్ని ఆ షేర్‌ఖాన్ రక్తంలో కడిగి కడిగి ధ్వంసించువరకు ఈ గ్రామసింహాని (పొడుకరుచుకొని) — ఈ సంగ్రామసింహుని కంటికి నిదురవచ్చుట కల్ల !

(ఒకభటుడు ప్రవేశించి సలాముచేసి)

భటు—రాజాసాహెబ్ ! వెంటనేవచ్చికలుసుకొమ్మని సర్దారట్టులవారియాజ్ఞ !

సంగ్రాం—హాజర్ ! హాజర్ ! (భటునితో నిష్క్రమణం)

వంది—జహాంగీర్ బాదుషా హెన్ని బిరుదుల్ హిచ్చినా, ఈ సంగ్రాంజాదాకు

షేర్‌ఖాన్ హిచ్చిన బిరుదు హొక్కే శాశ్వతం. రాజాల్ హిచ్చినబిరుదు రంగుమోళ్ళే బిరుదు. లోకుల్ హిచ్చిన బిరుదు లోకుతెల్సిన బిరుదు!

(నిష్క్రమణం)

## రంగం మూడు

## దృశ్యం మూడు.

(చంద్రికోసం నిరీక్షిస్తూ లైలా దండలు గుచ్చుతూ పాడుతోంది. లైలాకు సాయంచేస్తూ మధ్య మధ్య మెహెరుకూడా పాడుతోంది. పాటమధ్య మీర్జా గయాష్ ప్రవేశం. అతనిముఖభావం పరికించి లైలా మెహెర్లు కంగారు పడతారు.)

లైలా—దాదా ! నాయనగారేరి ?

మెహె—అబ్బా ! వారేరి ?

మిర్జా—మెహెర్ ! లైలా ! షేర్‌ఖాన్‌కు కుశలం. ఆందోళనపడవద్దు. పాదుషాఆజ్ఞచేత షేర్‌ఖాను ఏనుగుతో యుద్ధం చేశాడు. షేర్‌ఖానే గెల్చాడు—ఏనుగే హతమైంది. కాని అక్కడక్కడ చిన్న గాయాలుతగిలినవి. పల్లకీలోఎక్కించుకొని కొంచెంసేదతీరినతర్వాత మళ్లీపల్లకీ మీదనే ఇక్కడికి తీసుకువచ్చాం. అదిగో —

లైలా—బాబా ! బాబా ! (అంటూ లైలా వెళుతుంది)

మెహె—(కూడా పోబోతుంటే)—

మిర్జా—(ఆపి) మెహెర్ ! తర్వాతచూతువుగాని—ముందు లోపలికిపోయి ఉపచార సామగ్రి తీసుకురా ! —

మెహె—(ఎటుపోవ్వటకు తోచక, చివరికి ఇంట్లోకే వెళ్లుతుంది ఉపచార సామగ్రికోసం)—

(లైలామీద ఇంచుకఆనుకొని షేర్‌ఖాను ప్రవేశం. షేర్‌ఖాను సోఫాలో కూర్చుంటాడు. ప్రక్కనేకూర్చుంటుంది లైలా. లైలాకళ్లల్లో అశ్రువులుఉబుకు తున్నాయ్).

లైలా—బాబా ! ఏనుగుతో పోరాడిగెల్చివచ్చావా ! ఎంతఅద్భుతం ! ఎంత ఆనందం ! కాని_బాబా ! ఆపాదుషా ఎప్పుడూ నీచేత ఇలాంటి ప్రమాద కార్యాలే చేయిస్తాడేమిటి ?

మిర్జా—లైలా ! తర్వాతమాట్లాడవచ్చు. నీవుకూడా లోపలికివెళ్లి మీఅమ్మకు సాయంచెయ్యి.

లైలా—సరే. (లైలా నిష్క్రమణం)

(ఇక జరుగబోయే సంభాషణలో మధ్య మధ్య మెహెరున్నీసా వస్తూ పోతూ ఉపచారాలు చేస్తూవుంటుంది. ఆమె వచ్చినపుడు మీర్జా షేర్‌ఖానులు తమ సంభాషణ ఆపు తారు.)

మీర్జా— షేర్‌ఖాన్! జీవనమరణసమస్య ప్రళయజీమూతములవలె ఫెళ ఫెళార్భటులతో వచ్చి పడ్డది. ఇక రహస్యం కాదని ఇన్నాళ్లూ దాచివుంచిన మెహెర్ వివాహ పూర్వగత గాధ ఇవ్వాళ నీకు చెప్పివేశా. ఇక ఒక్కటేమార్గం. శ్రద్ధగావిను — షేర్ ఖాన్! నీధ్యాసం ఇక్కడలేదు!—

షేర్— జీవనమరణ సమస్య? — మార్గం! — మామా! దేనికామార్గం? ప్రాణాలు రక్షించుకోడానికా?

మీర్జా— ఔను. నీవు నీకుటుంబాన్ని వెంటబెట్టుకొని ఈ ఆగ్రానుంచి తక్షణం పారిపోవుట ఒక్కటేమార్గం. పులిని, ఏనుగును, మావటివానిని నిమిత్తమాత్రంగా చేసిపన్నిన గూఢ తంత్రాలన్నిటిలోను అతను విఫలుడయ్యాడు. తుదకు సంగ్రామంచేత నీకు విస్పష్టంగా చెప్పించికూడా విఫలుడయ్యాడు. ఇక అతను విఫలుడు కావటంచుకోలేదు ఈ ఆగ్రానుంచి నీవు ఎప్పుడు ఎక్కడికి పారిపోతావో అని ముందుగానే అనుమానపడి, వలసిన కట్టుబాట్లన్నీ అమోఘంగా అతినిర్దాక్షిణ్యంగా చేయించివుంటాడు. షేర్ ఖాన్! ఈక్షణంలో ఈ ఊళ్లేకాదు, ఈ ఆగ్రా మహానగరమంతా నీపాలిటి అఖండ కారాగారంగా నిర్మాణమై వుంది. అయినప్పటికీ, ఇకరాత్రివేళ — తప్పించుకొనిపోవుటకు అవకాశంవుంది. నాయనా! వెంటనే వెళ్లిపో! ఇదే నాహితోపదేశం. పొద్దుపోయింది. ఇక నాకు అనుజ్ఞ!—(మీర్జా నిష్క్రమణం)

షేర్—(రోషక్రోధాలు ముప్పిరిగొంటున్నవి) ఏమేమీ! లోకములో ఇంతటి నైచ్యము ఇంతటి దౌర్జన్యము నిజముగానుండునా?

సీ. నాపాలి బందిఖానా చేసెనా పాదు
షా నీచబుద్ధి నాగ్రానగరిని?
పరసతీవాంఛ కళంక విహారమా?
తన సతీరక్షకు దారిస్తున్న?
ఆతతాయికిఫలం బాయు వారోగ్యమా?
శిష్టుకు బహుమతి చీకు చింత?
కత్తికోత కసాయినెత్తిం బువ్వులవాన?
గొరియల మెడల కత్తెరల బోన?

ప్రకమిప్పైఖరి యింకెయుం ? నే పొరబడితినో ?
తారు మారయ్యెనో సత్య తత్త్వమవని ?
అడవిచూడంగ వీరసింహము సివాయ
గ్రామములు చూడ దొంగకుక్కల బజారు !

ఈ తారుమారు అసహజం. ఇదిదారుణం. ఔను (అంటూఖడ్గందూయగా మెహెర్ ప్రవేశం)
మెహెర్ ! నాఖడ్గం ఇటు తే !

మెహె—అదేమి ?—ఎందుకుస్వామీ ?

షేర్—ఈక్షణం జహాంగీరు వద్దకుపోయి ఈసమస్యను భయంకరంగా పరిష్కారం చేసుకొనివస్తా.

మెహె—స్వామీ ! తెలిసికూడా మళ్ళీవెడతారా ! ?

షేర్—ఔను !

మెహె—వద్దు వద్దు స్వామీ ! మళ్ళీ ఏదైన ప్రమాదం వస్తుంది.

షేర్—రానీ ! నీకు మరీమంచిది. అప్పుడునీవు నిరాటంకంగా భారతసామ్రాజ్ఞివి కావచ్చు—

మెహె—నాథా ! ! !—భరిహాసమా !

షేర్—కాదు-ఇది జీవన మరణసమస్య. మనస్ఫూర్తిగా చెబుతున్నా-బ్రతుకవలెనను అభిలాష నాకులేదు.

మెహె—ప్రాణపతీ ! నేను ఇంతవిపరీతంగా మాట్లాడుతున్నారేం ?

షేర్—మెహెర్ ! ఎటుచూచినా ఒక్క టేదృశ్యం-మృత్యువు ! ఎటువిన్నా ఒక్కటే ధ్వని-దాహహాకారం ! కేవలం ఈ దృశ్యాన్ని చూస్తూ ఈ భయంకర ధ్వనిని ఆలకిస్తూ విభ్రాంతుడనై విగతచేష్టుడనై యెంతకాలం పడివుండాలి ?—

మెహె—అటులైన నాథా! అందరం ఇప్పుడే వెళ్ళిపోదాం. మనకు అస్త్రమాట్టి వద్ద ఉద్యోగమేవద్దు. నామనవి ఆలకించండి, ప్రాణేశ్వరా !

శా. ఆ దుష్టాత్ముని తుచ్ఛ మోహకలుషవ్యాసక్తి నిశ్వాసమే
యే దేశంబులు ప్రాకిరాఁగలుగునయ్యో దేశముల్ జేరి, యొ
ట్లో, దారిద్ర్యమొ? కల్మియో? కలిమియో? గంజో ? కష్టమో?
సౌఖ్యమో?
యేరీతిని బొట్టబోసుకొనలేమే నాథ! పోదాము! రా!—

షేర్—కాదు, మెహెర్! విపత్తుకు వెరచి వెన్నుచూపుట నాపద్ధతి కాదు. నేనే ఎదురేగి దానికి స్వాగతమిస్తా. మరణము తప్పదా?—మరణింతును. అదియు నీకొఱకే (గద్గదకంఠంతో) మెహెర్! నీకోసం మరణించుట కూడా ఒకసుఖమే. అదీగాక, చెప్పదుగా?-వద్దు-కాదు-చెబుతా-మెహెర్! కావలెనని మరణంకోసం నేనే వెతుకుతున్నా.

మెహె—ఎందుకు స్వామీ?!

షేర్—ఎందుకా? నామీద నీకు ప్రేమ ఉండజాలదని గ్రహించడం చేత—

మెహె—ఎంతమాట! ఎంతమాట!—నాథా!—నాథా!—

షేర్—ఔను. మెహెర్! ఇన్నాళ్ళూ నేను ఒక అగాధ స్వప్నంలో ఉన్నాను.

సీ. అల జహాంగీరు షాహంషాహ మహిషివై
రాణింపఁదగిన నీరాణయేడ!
ఊరు పేరులు లేని షేరుఖానుని యింట
నిప్పచ్చరమ్మున్న నీల్గులేడ?
హురుమంజి ముత్యాల తెరలుగట్టిన తూగు
టుయ్యాలలందూగు యోగమేడ!
జీర్ణాంశుకములతో జీరుకాడుచు సదా
పర్ణశాల వసించు ప్రాప్తియేడ?
బంగరు గద్దె నధిష్ఠించి, జగతి కన్ను
మెరుపు మెరుగులతో మిరుమిట్లు గొలుపఁ
గలుగు మణిఁదెచ్చి మసిపాతఁ గట్టినాడ!
లోభి ప్రేమకు దగరాని లోతు కలదె?

మెహె—(ఏడుస్తూ) స్వామీ! స్వామీ! ఈవిధంగా ఎన్నడైనా అన్నానా నేను?

షేర్—అనలేదు. అనకపోయినా నేను ఊహించుకోవాలి. కాని ఆ ఊహ నాకు కలుగలేదు. మానవప్రకృతి, అర్ధం చేసుకోవాలనే విషయమే నాకు స్ఫురించలేదు. ఎందుకంటే, మెహెర్! నాప్రేమ కన్నుగ్రుడ్డి-విని చెవుడు!

మెహె—స్వామీ! నాప్రేమదేవతా! క్షమాకరో! క్షమాకరో! (పాదాల మీద పడుతుంది).

షేర్—కాదు-మెహెర్! తప్పు నీదికాదు. నాది! ఏ సుందరిని పత్నిగా బడయుటకై జహాంగీరువంటి చక్రవర్తి పిచ్చివాడై తిరిగెనో, ఆమెను ఈ దౌర్భాగ్య

షేర్‌ఖాను పెండ్లి యూకుట అగ్గితో మిన్నత చెర్లాటంగాక శేషమున్నది? మెహెర్! ఇక వెడతా! దేనికంటే, నీవంటి అమూల్యరత్నం ఇంకొకనికి అనాయాసంగా లభిస్తే, ఆ రత్నానికి విలువవుండదు. కాబట్టి అక్షతూల్యాన్ని ఈ భీకర కరవాలానికి అతడు అర్పించుకొనిన అనంతరంనిన్ను పరిగ్రహించుగాక! (పోతూవుండగా)

మెహె—(కాళ్లకు అడ్డపడి) వద్దు! ఆగండి! స్వామీ—

(షేర్‌ఖాను విదిలించుకొని వెళ్లబోతుండగా సంగ్రామసింహుడు ప్రవేశం)

సంగ్రాం—ఆగు షేర్‌ఖాన్! ఆగు! నీమృత్యువు నీయింటికే వచ్చివిల్చొంది. అంతిమాదరం పొనక్కరలేదు. (కత్తిదూయుచు)

ఉ. మృత్యువు మృత్యువో యనుచు నెంతయు నీవటు దేవురింపగా
భృత్యుని కోర్కెదీర్ప దయబెంది జహాంగిరు నన్నుఁబంపె! నీ
మృత్యువు చూడు కట్టెదుటనే నిలువంబడె! రమ్ము స్వర్గ సాం
గత్యము! అప్సరో వరల కౌఁగిటి! రాయిక! రమ్ము ఖాలిశా!

షేర్—(కత్తిదూయుచు) ఓరీ! అభిమానహీనా!

చ. హితులను వారి యిండ్లఁబడి, యెంగిలికంచము చుట్టుబడ్డ యా
మెతుకులు నోటితో గతికి, మెండుగ వాలముఁ ద్రిప్పి, మట్టెను
ధ్ధతిఁ బయికెత్తుమన్ శ్రవణదారుణగానము చేసినంతనే
క్షితిగలదాంగకుక్కలను సింహములందురె? గ్రామసింహమా!

మెహె— ఇట్టి గులామును చంపుటకు మీ వీరఖడ్గము కావలెనా? నిలు మాంతా! నిలు!

(బాకుతీసి మెహెర్ సంగ్రామ్మీదికి లంఘిస్తుంది. షేర్‌ఖాన్ ఖడ్గహస్తుడై అతన్ని ఎదుర్కొంటాడు. సంగ్రాం ఈలవేస్తాడు. పక్క తెరలగుండా హంతకసమూహం వచ్చిపడుతుంది. సంకులసమరం, లైలాప్రవేశం. లైలా మెహెర్లు బాకులతో పోరాడుతారు. షేర్‌ఖాను చాలామందిని తనకత్తికి బలిపుచ్చుకుంటాడు. ఇకవూరుకుంటేలాభం లేదని సంగ్రాంసింగు తనపిష్టల్ తీస్తాడు. బాగాగురిపెట్టి షేర్‌ఖానుమీద పేలుస్తాడు. షేర్‌ఖాన్ 'అల్లాహో అగ్బర్!' అంటూఅరిచి వెంటనే హతజీవుడై పడిపోతాడు. "స్వామీ, స్వామీ" అంటూ మెహెరున్నిసాయూ, "బాబా! బాబా!" అంటూ లైలాయూ బిగ్గరగా అరుస్తూ షేర్‌ఖాన్ శవంమీదపడి యేడుస్తూవుంటే, వాళ్లిద్దర్నీ మిక్కిలి బలాత్కారంగా లాగి, నోటగుడ్డలుకుక్కి, కాళ్లూచేతులూ కట్టివేసి మోసుకొని పోతూవుండగా
(తెరమెల్లదిగా వాలుతుంది)

# అంకం రెండు

## దృశ్యం ఒకటి

(ఆగ్రా మహల్లోపం)

మెహ—లైలా! -ఒకసారి-రానాదగ్గరికి- (లైలాకు ఉత్సాహంలేదు) ఇకనీవె నాసర్వస్వం.

లైలా—అమ్మా!

మెహ—లైలా! క్షీణచంద్రునివలె నీముఖబింబం రానురానుకళాహీనం అవుతున్నదెందుకు?

లైలా—నీకు తెలియదా? అమ్మా! ఈ మహల్లోకి అసలు ఎందుకువచ్చావు?

మెహ—రాకుండా తప్పించుకొనే ఉపాయం కనపడలేదుగదా.

లైలా—విషంత్రాగి చావటానికికూడా ఉపాయం కనపడలేదా? అమ్మా! బ్రతుకుమీద నీకింత మమకారం వుందని నేననుకోలేదు. ఎవడు నాకన్నతండ్రిని నిష్కారణముగ హత్యగావించెనో ఆకసాయి ఆకిరాతుడు ఆపాషాణి అయధికారమదమత్తు---

మెహ—లైలా! లైలా! ఆగు.

లైలా—నేనాగను. ఇక ఆగలేను. దినదినము మంటలు ఎగదోస్తున్న ఈ అంతర్జ్వాలను ఇక ఆపలేను. ఆ జహాంగీరు నాతండ్రిని దొంగపోటున అర్ధరాత్రివేళ ఏకాకిని చేసి దారుణహత్య గావించెననువార్త భారతఖండమంతా ప్రతిధ్వనించేటట్లు మేఘగర్జనతో ఘోషిస్తా. నానాలుకలో వాక్కు నిల్చియుండునంతకాలం కోదోంకరాళమంతా నా రోదనతో నిండి నిశ్శబ్దిత మయ్యేటట్లు ఘోషిస్తా. ఆ హంతకుని కళంక మషీమాలిన్యంతో ఆకాశమంతా కరాళకాళిమచ్ఛటా పటలమయ్యేదాక ఘోషిస్తా!

మెహ—బేటీ! భర్తను పోగొట్టుకొన్నా! ఈమహాలులో ఇట్టిప్రసంగం ఇంత నిర్భీకంగా ఇంత బహిరంగంగా నీవుచేస్తే నిన్నుకూడా పోగొట్టుకొని నే నేంచేసేది! తల్లీ!—

లైలా—అంటే! పాదుషా నన్నుకూడ హత్యచేస్తాడా! చేయనీ! నేనువణికే దాన్నికాదు. నీవలె ప్రాణంకోసం ప్రాకులాడే దాన్నికాదు. చూస్తా ఎవరాపుతారో! అమ్మా! రాయిక్కడనుంచి పోదాం!

మెహ—లైలా! అనుజ్ఞలేదుగదా!

లైలా—అనుజ్ఞ ఎవరిది? ఎందుకు? మనము ఖైదీలమా?

మెహ—ఔను బేటీ.

లైలా—ఏమి అపరాధం చేశాం?

మెహ—తెలియదు.

లైలా—(కోపంతో) అమ్మా! నీవుబలాత్కారంచేతనే ఇక్కడికివచ్చావు. అంతవరకు నాకర్థమైంది. మరి, వచ్చి నాలుగేండ్లు కావస్తున్నది. ఇంతవరకు నీవు ఒకనాడైనా ఈచెరనుండి విముక్తురాలవగుటకు యత్నంలవలేశమూ చేసినట్లుకూడ నేను చూడలేదు. యథావిధంగా, కులాసాగా, ఈ ఆగ్రాయే మనజన్మస్థానమన్నట్లుగా ఈమహలే మన ఇల్లన్నట్లుగా కాలక్షేపంచేస్తున్నావు. నిజంచెప్పు. అసలుయిక్కడనుంచి నీకు పోవాలని వుందా-లేదా?

మెహ—వుంది.

లైలా—ఉంటే సమ్రాజ్ఞి జోధపురీబాయి ద్వారా అనుజ్ఞకోసం ఎందుకు ప్రయత్నం చెయ్యవు?

మెహ—సమ్రాట్టు అనుజ్ఞ ఈయరు.

లైలా—తప్పక యిస్తారు-నేనంటున్నా! ఇచ్చితీరతారు. నీవు ప్రయత్నంచేసి చూస్తేకదా! చెయ్! చేస్తావా?

మెహ—చేస్తా.

లైలా—అయితే ఆకష్టం నీకేమీవద్దు. నీవిముక్తిని సాధించుకొని వచ్చే బాధ్యత నాది. నేనే వెడతా. ఆ సమ్రాట్టు ఎందుకు ఈయరో చూస్తా. పోనీ. (నిష్క్రమణం)

మెహ—వద్దు నీవువెళ్లవద్దు! బేటీ! బేటీ!—అతను హంతకుడసుమీ—విను—బేటీ!

మోతీ—(కానుకల పళ్లెరంతో ప్రవేశం) అమ్మా! ప్రభువులవారు ఈసారి మరీ మరీ చెప్పమన్నారు ఈకానుకలు మీరు తప్పకుండా స్వీకరించాలట! తల్లీ! రాజులు మహారాజులువచ్చి వంగివంగి సలాములుచేసి ఎన్నెన్నో కానుకలు ఇస్తే కన్నెత్తి చూచి చూడనట్లుండే ప్రభువుకు, ఇన్నాళ్లకు కలిగింది కానుకలంటే అసక్తి-ఇవాళకటికి పంపించడమంటే ఇంకా అసక్తి-తప్పకుండా స్వీకరించండి అనిచెప్పడమంటే మరీ మరీ అసక్తి-

మెహ—(కానుకల పళ్లెరాన్ని అమాంతంగా విసిరేసి) ప్రలాపినీ! నోరుకట్టు! ఇంకొకసారి నీవిచటికివచ్చినా నీప్రభువుపేరు ఉచ్చరించినా-జాగ్రత! - పో! పోయెదవా? లేదా? ఊఁ- బేటీ! బేటీ!

మోతీ—అమ్మా! భారతసామ్రాజ్యలక్ష్మి తనకుతానై వచ్చి వరిస్తుంటే కాదని కాలదన్నుకుంటావా? ఆ ప్రభువులవారికి మీమీద ఎంతప్రేమ?—ఎంత.

(మెహర్ మోతీని బలవంతంగా నెట్టివేస్తుంది)

మెహ—ఎట్టి దుస్థితి వచ్చిందినాకు!

## దృశ్యం రెండు

(ఆగ్రామహల్లో పిచ్చి వంది మాగధుల ప్రవేశం)

వంది—(శంఖం శంకీతం) వచ్చింకీరే వచ్చింకీ! తుఫాన్ రాజ్యంతుమ ముసాఫిరయ్ తుఫాను వచ్చింది !

మాగ—క్యాహువా ?

వంది—ఆగ్రాహంతా గడ్‌గడా హూండ్క్యపోతుండానికే !

మాగ—క్యాహువారే !

వంది—సమ్రాట్ ఫెద్దకొడుక్కు యువరాజ్ ఖుస్రూసాబ్-హద్దేబెండా హొత్తాడురే !

మాగ—హెవరిమీద ?

వంది—తండ్రిమీద ! !

మాగ—ద్రోహం ?

వంది—హాఁ- తండ్రికీపట్టీ హజానుత్ నేనీ, తన్నే సమ్రాట్ కావాలా అని తయ్యార్నె వుండాడ్.

మాగ—అరే ! తండ్రికి భక్తి వుండగా కొడుక్కు హింతపని సేస్తాడ్ !

వంది—అరె ! ఫెళ్లాన్కి భక్తి వుండగా హింకొక్కడ్ని ఫెళ్లాన్కి పట్నాలిఅని తండ్రి వుండాలే తయ్యార్కే ?

మాగ—సచ్‌హై ! తండ్రిహిల్గా! కొడుకున్హాలా! ఠుగర్-వందీభాయ్ ! ఓఖుస్రూ సాబ్ అచ్చా ఆక్మీకర్కె హం సునారే !

వంది—హై-మగర్-రాజ్యం హూక్టీ రండీ హూక్టీ హెంతా అచ్ఛా అద్మీకైనా పట్టీ బచ్చా అద్మీ కర్ దీహై

మాగ—రే ! హిప్డా గ్యాపక్ వస్తాసేహూకీ హూక్టీ రహస్యం. ఓ గ్రాంషింహాం వుండాడే వాడ్కి ఓ యువరాజాకూ సాలాసార్లు మాలాఖాత్ హైంది. హాళ్ళీ హిద్దర్కీ హేమేమో రాత్‌దిన్ గుస్‌గుసా గుస్‌గుసా సేస్తావుంటే మస్కీ-ఫెళ్లాం మోతీబాయ్ నూసిసెప్పింది.

వంది—ఆహా ! ఓ షున్కొంవాడు తోక హిల్గా ఫిరాయించింది !

మాగ—రే ! రే ! ఈస్పర్ పీ దేఖో ! ఓ గ్రాంషిహాం ఔర్ యువరాజా ఖుస్రూసాబ్ బాత్ కర్తే కర్తే ఇపరీ ఆరై. చల్‌రే చల్.

(ఇద్దరూ విష్క్రమణం)

(ఖుస్రూ, సంగ్రాం—మాట్లాడుతూ ప్రవేశం)

సంగ్రాం—యువరాజా! వెనుకముందులు ఆలోచించవలసిన అగత్యంలేదు. అపాత్రులైన తండ్రులను తొలగించి తనయులు తామే సింహాసనం అధిష్ఠించుట అన్ని దేశాల్లో అన్నికాలాల్లో పరిపాటియైన కార్యం.

ఖుస్రూ—కావచ్చు కాని—నామనస్సు అంగీకరించటంలేదు.

సంగ్రాం—ఈ మహాపుణ్య కార్యంలో దేశమంతా మీపక్షం వహించడానికి సిద్ధంగావుంది. ఎందుకంటే ప్రజలందరికీ మీమీదవున్న భక్తికీ అనురక్తికీ అంతూపొంతూ లేదు. అన్నిటికంటె ముఖ్యంగా ఆ షేర్ఖాన్వంటి సింహబలుణ్ణి చించిచెండాడిన ఈ సంగ్రామ—ఈ సంగ్రామసింహుని భీకర కరవాలం మీసేవకోసం ఎప్పుడెప్పుడాయని తహతహలాడి పోతుంది.

ఖుస్రూ—మంచిదే కాని, 'పితృద్రోహి' అనే పేరు చరిత్రలో ఆచంద్రార్కంగా నిలబడి పోతుంది.

సంగ్రాం—చరిత్ర!—ఆ చరిత్ర వ్రాసేవాళ్లకు తలొక జాగీరు తలొక రాజా బహద్దరు తగిలిస్తే 'పితృద్రోహి' కాకున్న 'పితృభక్తి' గా సమర్థించి వ్రాసేస్తారు.

ఖుస్రూ—సంగ్రాం! తండ్రిభయం ప్రజలభయం చరిత్రభయం నాకులెక్కలేదు కాని మహాసేనాపతి—ఆయోధపితామహుడు—మహాబత్ ఖాన్—అతను అడ్డువస్తాడేమో అనే భయంతో అచలా విచలం అయిపోతున్నా!

సంగ్రాం—అతనిపేరుచెప్తే నాకూ గుండెదడగానే వుంటుంది. కాని, ప్రభూ! అతనుమీకు అడ్డురాడని నా అంచనా. ఎందుకంటే యితడు పుట్టుకచే హిందువు. సమ్రాజ్ఞి జోధపురిబాయి కొడుకులు కావడంచేత మీలో కూడావుంది హిందూరక్తం. కాబట్టి అభిమానం అతనికి తప్పకుండా వుండితీరుతుంది.

ఖుస్రూ—మహాబత్ ఖానుకు హిందూ ముస్లిం పక్షపాతంలేదు. అతను రాజ్యపక్షపాతి—క్రమపక్షపాతి.

సంగ్రాం—కానిండు. ప్రజలంతా మీపక్షాన్నివున్నప్పుడు, మహాబత్ ఖానువంటి వాడుకూడ తోకముడుచుకొని పోవలసిందే.

ఖుస్రూ—పట్టి మందలాంటి ప్రజ యేంచేయగలదు? సైన్యంఅంతా అతని చేతిలోవుంది. ఆ సైన్యంఅంతా అతణ్ణి దేవుడిగా పూజిస్తుంది.

సంగ్రాం—అయితే-యువరాజా! గొప్ప ఆలోచన మెరుపులాగ మెరిసింది బుర్రలో.

ఖుస్రూ—ఏమిటది?

సంగ్రాం—సమ్రాట్ కంటే ముందుగా మహాబత్ ఖానే అంతరించాలి !

అంటూవుండగా అవటికే వస్తూవున్న మహాబత్ ఖాను దూరంగా సంగ్రాం కంటికి ప్రత్యక్షం అవుతారు. సంగ్రాంకు వణుకుప్రారంభమైంది. మహాబత్ ప్రవేశం.

సంగ్రాం—(వణుకుతూ) హిహిహి ! మహాబత్ ఖాన్ జీ ! సలాం ! సలాం !

మహా—సంగ్రాం ! యువరాజుతో ఏమిటి చెబుతున్నావు ?

సంగ్రాం—హిహిహి !

మహా—సంగ్రాం !—నాప్రశ్న ?—

సంగ్రాం—హిహిహి ! అంటే-మరి-యువరాజువారికి మహారాష్ట్రి అప్పడాలంటే చాలాయిష్టం. అవి చేయించిపెట్టమని నాకు ఆజ్ఞయిచ్చారు. ఎందుకంటే నాది మహారాష్ట్రదేశమేగా. ఆఅప్పడాలపిండిలో కాశ్మీరంయింగువ మెసిపి, ఖోరాసానీ వాము చల్లి—

మహా—నీ కులవృత్తి ఆదేశాస్త్రాలు !—

సంగ్రాం—హిహిహి

మహా—ఆవృత్తి విడిచి ఈవృత్తిలోనికి రాకుండావుంటే ఈసామ్రాజ్యం ఇంకా ఎంత సుఖపడేదో !

సంగ్రాం—హిహిహి !

మహా—సంగ్రాం !—నేను మొదలు ఈ యువరాజుతో నీవు ఎప్పుడు ఎక్కడ కనపడినా ఈ మహాబత్ ఖాన్ వల్ల అక్కడనే నీకు మృత్యువాగ్నవం ! నేటికి క్షమించి విడిచి పెడుతున్నా !—ఇకపో తోకముడుచుకొని.

సంగ్రాం—హిహిహి !—

మహా—నాఆజ్ఞ వినపడలేదా !

సంగ్రా—హిహిహి !—(అంటూ నిష్క్రమణం)

మహా—యువరాజా !

ఖుస్రూ—దాదా !

మహా—పిత్రద్రోహాలోచనం మానండి.

ఖుస్రూ—తాతను ! మానజాలను ! అసంభవం ! నాస్నేహితులతో ఒట్టుపెట్టుకున్నా.

మహా—ఇంతటిపట్టుదల యెందుకు కలిగింది ? మీ తండ్రిగారు మీకు ఏమిద్రోహం చేశారు ?

ఖుస్రూ—నాకు కాదు-నాకన్నతల్లి జోధపురీబాయికి చేస్తున్నాడు ద్రోహమంతా.

మహా—అర్థమైంది. కాని—

ఖుస్రూ—సేనాపతీ! నీవేమన్నావురే! నా ప్రయత్నం కొనసాగించితీరుతా! కన్నతవాళ్లం నలుగురు కొడుకులం కంటియెదుట నుండగా, తనకు జీవిత మధ్యాహ్నశోభ దాటిపోవుచుండగా, నేటికీ దురంత వ్యసనలోలుడై, ఒకభర్త నుండి ప్రాణంతీసి ఒకభార్యను బలాత్కరించుటకై పన్నాగములు పన్నుతున్న ఈ తండ్రి నాకు జన్మదాతయే అగుగాక—

మహా—మీ ఆశయం కళంకరహితం—కాని, మీ ఆచరణ—

ఖుస్రూ—వద్దు-అడ్డుచెప్పవద్దు. దాదా! నీకు ప్రభువు తర్వాత ప్రభువును నేను. శిష్య వాత్సల్యంతో సంగ్రామ విద్యనంతయు నాకు నేర్పిన గురుదేవుడవు నీవు. కాబట్టి ఈ విషయంలో నీసహాయాన్ని కూడా అర్థిస్తున్నా. అదిగాక నీవు పుట్టుకచే హిందువుడవు. నాతల్లి కూడ పుట్టుకచే హిందువు. ఆ అభిమానం —

మహా— యువరాజా! ఆ ప్రసంగం అనుచితం. అప్పుడు 'రాం' అన్నాను ఇప్పుడు 'రహీం!' అంటున్నా. కాని 'రాం' అనిపిలచినా 'రహీం' అనిపిలచినా ఓ అని పలికేవాడు ఒక్కడేయని నావిశ్వాసం.

ఖుస్రూ—పోనీ! నన్ను చూచి సహాయంచెయ్ దాదా!

మహా—నాబొందిలో జీవం వుండునంతవరకు ఈసామ్రాజ్యంలో ఏట్టి అంతఃకలహం తలయెత్తినా నేను సహించను.

ఖుస్రూ—మహబత్! నీ అధికార ప్రదర్శనం నేనూ సహించను. నీవు వీరాధివీరుడవే కావచ్చు. యీ మొంగలుసామ్రాజ్యాన్ని కంటికి రెప్పగా కాపాడుతున్న ప్రచండ ఖడ్గహస్తుడవే కావచ్చు. కాని నేను ప్రభువును-నీవు సేవకమాత్రుడవు ఇది మొంగల్ సామ్రాజ్యంకాని మహబత్ ఖాన్ సామ్రాజ్యంకాదు.

మహా—పేరు మొంగలసామ్రాజ్యమేకాని ప్రజలంతా భారతీయులే యనువిషయం మరవకండి. ఈ సామ్రాజ్యాన్ని మహమ్మదీయుడు పాలింపనీ, హిందువుడు పాలింపనీ, లేక యే ఖండాంతర జాతివచ్చి పాలింపనీ, ఈనేల యందు ఆనాదినుండి సుప్రతిష్ఠితంఅయి వున్న సద్ధర్మాలు యేవిగలవో, ఆ ధర్మాలను అనుష్ఠించి పాలించు నంతకాలం ఆరాజు ఏదేశస్థుడైనా, ఏమతస్థుడైనా తనరాజేయని పూజించుట భారతీయుని స్వభావం.

ఖుస్రూ—అధర్మాలు అతిక్రమించుటచేతనే నాతండ్రి అపరాధి అయ్యాడు.

మహా—ఆ అపరాధాన్ని మాపుటకు మీరూ అపరాధులు కాబోతున్నారు.

ఖుస్రూ—నాది అపరాధంకాదు—ప్రజాహితమైన కార్యం. ఆ మెహరున్నీసా యెడల నా తండ్రికిగల అగాధ అచంచల వ్యసనం నీకు తెలును. ఆమెను, కట్టుకుండ

నాతండ్రి నిదురించుటకల్లే. అనంతరం రాజ్య సర్వస్వం ఆమెచేతికి నప్పగించి తాను వ్యసన డోలికా మాలికలలో మైమరచి నిద్రించుట నిశ్చయం. దాదా ! నీకంటె చిన్నవాడ్ని కాని నాతండ్రి ప్రకృతి నాకు తెలుసు. భవిష్యత్ చెబుతున్నాను ! ఈ భారతసామ్రాజ్యం యికనుండి నదుపుకత్తె సామ్రాజ్యం కాబోతుంది.

మహ— కానియ్యండి యువరాజా ! నేటిఖడ్గములు అనాడు మొద్దుబారునా ?

ఖుస్రూ— దాదా ! నీవు యోధుడవే కాని రాజనీతిపరుడవు కావు.

మహ—రాజనీతి !—యువరాజా ! భాషలో అనేక పదాలు మోసగిస్తూ యుంటాయి. రాజనీతి అనే ప్రత్యేకమయిన వింతనీతి ఒకటివున్నదని అదిలేకపోతే ఈసామ్రాజ్యాన్ని పేకముక్కలు పేర్చిన మేడలవలె గుభిల్లున కూలిపోవునని . చిన్ననాటినుంచి మన చెవులలో నూరిపోశారు రాజ్యాంగ వేత్తలు. కానిరాజ్యము ప్రపంచమే-రాజులు మనుష్యులే-నీతిఒక్కటే-సత్యం-అహింస ! యువరాజా ! అప్పుడప్పుడు కొన్ని ప్రశాంతసమయాల్లో ఒక అశరీరవాక్కు నాచెవులో చెబుతూవుంటుంది. యేమనగా

సీ. రక్తదాహముగొన్న రాకాసి యొక్కతె
మొగలాయి నగరులో మొగము సూప
తండ్రులు, తనయులు, తమ్ములన్నలు దారం
తద్వేష కంపన దద్దరిల్ల
అన్యోన్య కలహంపుటగ్గి కొంపలు ప్రతి
ధ్వనిత ఘాంకృతుల వక్త్రములు తెరువ
బాబరు నాటి, యక్బరు బెంప, సొంపారి
నట్టి ఈసామ్రాజ్య మగ్గిగలియ
భరతఖండంబు దిక్కరి పాడువడుచు,
కాచుకొనియున్న దొంగ కుక్కలకునెల్ల
తలుపు తెరిచిన యిలువోలె దారియొసగు
నంచు వినిపించు గగనవాక్యంబు, నీవు
సార్థకము సేయకయ్య ! అనర్థమయ్యె.

## దృశ్యం మూడు

(ఆగ్రామహల్లో-మెహరున్నిసా ప్రవేశం)

మెహ—తుదకు నావిముక్తికి వచ్చింది అనుమతి. కానియిప్పుడెచ్చటికిపోవుదును? తండ్రి యొద్దకా? బర్ద్వాన్‌కా? ఎవరున్నారు?—లేరు. లేకున్నమానె పోవుదును. యీ మహలులో యింక ఒక్కక్షణమైన ఉండతగదు—ఉండకూడదు ఉన్నకొలది నాహృదయమే పరమశత్రువై నన్ను ప్రతిఘటించునేమొ! వ్యసనదేవతా నృత్యరంగమయిన యీ అంతఃపురము నాకు దేహదౌర్బల్యాన్నే కాదు, బుద్ధిసాంకర్యాన్నిగూడ సంఘటిస్తుందేమో! ఛీ! కుటిలబుద్ధి—గులామీప్రకృతి! ఔను ఇక ఒక్కక్షణమైన ఇచట నుండతగదు, ఉండరాదు. పోయెదను—దేవుడా!-ఎచటికో-ఎట్లో-పోయెదను!

మోతి—(ప్రవేశించి) అమ్మా! సమ్రాజ్ఞి జోధ పురీబాయిగారు వస్తున్నారు.

మెహ—సమ్రాజ్ఞియా? స్వాగతం అనిచెప్పు!

(మోతీ నిష్క్రమణం, అద్దంలో చూచుకుంటూ మెహర్ తనవేషం దిద్దుకుంటుంది, ఇంతలో జోధపురీబాయి ప్రవేశం, -ఆమెకు మెహర్ బందగి చేస్తుంది. మెహర్‌కు ఆమెకూడ బందగిచేస్తుంది.)

జోధ—మెహరున్నిసా! నీకుఒక శుభవార్త చెప్పటానికి వచ్చాను. కానినీవదనన్నా హంచూస్తే ఆవార్తయిదివరకే నీకు తెలిసిందని గ్రహించుకుంటున్నా.

మెహ—ఔను సమ్రాజ్ఞీ. నావిన్నపము ఇన్నాళ్ళకు సఫలమైంది.

జోధ—మెహర్! కన్యాసహితవై ఇకనీఇచ్ఛవచ్చిన చోటికి పోవచ్చు.

మెహ—ఈవార్తను స్వయంగా చెప్పుటకు శ్రమఅనుకోకుండా వచ్చిన మీ ఔదార్యానికి నాకృతజ్ఞతను ఏవిధంగా చూపించాలో తెలియకుండావుంది.

జోధ—మెహర్! ఒకప్రశ్న అడుగవలెనని అనుకొంటున్నా.

మెహ—అవశ్యం.

జోధ—నీకు రాణివికావలెనని ఉన్నదా?

మెహ—క్షమించండి. నాకు ఏమికావలెననియులేదు. తిన్నగాతిరిగి బర్ద్వాన్‌కు పోవలెనని మాత్రంవుంది.

జోధ—మెహర్! నీవు కాదలచుకొంటే రాణివి కావటం ఒక్కక్షణం. రాణీ అంటే సామాన్యరాణీకూడా కాదు—రాణీయోంకీ రాణి! భారత్‌కి అధీశ్వరి! ఏపదవి ఇన్నాళ్ళూ నాకు ప్రాప్తమైవుందో అదేపట్టమహిషీత్వం మెహర్! పదునాల్గేండ్లక్రితం సమ్రాట్ నిన్ను ఎంతప్రేమగానియుండెనో నేఁడుకూడ అంతే కాదు—అంతకంటె ఎక్కువగాకూడ ఉన్నాడు. ఆసమ్రాట్టు, అతని అఖండసామ్రాజ్యం, రెండూ నీకొంగు

ముడిలోకి తమంతతామే నడిచివస్తున్నవి. ముడివేసుకుంటావో! పారవేసుకుంటావో !
ఆ మహత్తరనిర్ణయం నీభ్రుకుటీ విక్షేపమునందలి ఒక్క భంగిమమీద-నీనాల్కకొనయందలి
ఒక్కఅక్షరంమీద తేలియాడుతుంది. ఏమిటి ఆలోచిస్తున్నావు ?

మెహె—ఆలోచన ఏమనగా లోకప్రసిద్ధుడైన అట్టిభర్తను, సకలసంపత్కర
మైన అటువంటి సామ్రాజ్యాన్ని మీరంతటమీరు నావంటి పరస్త్రీకి ఇంత అయాచితంగా
ఇంతఅనాయాసంగా, అర్పించుకొనే అసాధారణ ఔదార్యం యెక్కడైనావుందా ?

జోధ—మెహెర్! నేను హిందువును. నాహిందూజాతి స్త్రీలకు జన్మసాఫల్యం
పతిసేవ, పతిభక్తి, పతిఆనందం. అట్టిసమ్రాట్టు, ఇట్టి సామ్రాజ్యం, నాఆరిచేతిలోవున్నా
నాఆశలన్నీ యిక్కడతీరవు—అక్కడవున్నవి—చెప్పు ! మెహెర్ ! నీనిర్ణయమేమిటి ?

మెహె—సహీ సమ్రాజ్ఞి ! మైసమ్రాజ్ఞీ నహీహోనాచాహ్‌తీ.

జోధ—మంచిది. ఇందుబలవంతమూ ఏమియూలేదు. నీ హృదయంలో నన్ను
గూర్చియిట్టి సంకోచమూలేకుండ నాఅంతనేవచ్చి నాహృదయాన్ని నీకువెల్లడించాలంటే
ప్రొద్దుపోయింది ఇకనేవెడతా !

(జోధ పరివారము నిష్క్రమణం)

మెహె—రాణీయోంకీరాణి ! భారత్‌కీ అధీశ్వరి ! ఈ తలంపులో ఏమైనాచిత్త
శక్తియుందోకాని అపాదమస్తకమన్ను భూకంపంవలె వుద్రేకత ఊగిస్తున్నది. ఛీ !
దారుణదురంతపాతకం !— కాని తేరిపారచూచుకొంటే నాభావిజీవితానికి గమ్యస్థాన
మేమిటి ? నిష్ఫలరోదనం—నిరంతరదారిద్ర్యం ! —ఛీ ! ఈవిచారణమే యింతఅనర్థా
నికి కారణం. ఔను వద్దు, మెహెర్ ! నిన్నునీవే మోసగించుకుంటున్నావు ? జాగ్రత!
జాగ్రత ! అబ్బా ఈగది ఇంతవేడెక్కిందేం !—ష్ ! (అటూ యిటూ తిరుగుతుంది-
లేస్తుంది, కూర్చుంటుంది) ఎక్కడైనా మనుష్యులుండేని ఆత్మలుకంటాయా ?
ఉండకపోతే ఇన్నాళ్లు యీఅంతర్యుద్ధందేనికి జరుగుతూంది ! —ష్ ! ఎంత
వేడిగా ఉందిక్కడ !—ఛీ ! అట్టిదారుణ అకార్యం నేనుచేయను. నాహృదయాన్ని
నిర్దాక్షిణ్యంగా నిగ్రహించుకుంటా ! నాదృఢసంకల్పాన్ని నిరాఘాటంగా పాలించు
కుంటా ! ఆ ప్రియనాథుని, ఆ ప్రేమమూర్తిని స్మరించుకుంటూ అతని ప్రతిబింబాన్ని
నా లైలా కంటిపాపలో వీక్షించుకుంటూ యీ దుష్ట ప్రపంచానికి దూరంగా తొలగి
ఎట్లో ఎక్కడో ఈజీవితాన్ని గడతేరుస్తా. ఇప్పుడే—ఈక్షణమే—ఈమహాలునుండి
స్వతంత్ర విహారధామమైన ఈభూధరగహ్వరంసి, తుచ్ఛసుఖలాలసాదేవతకు జయజయ
ధ్వానములు పలికే ఈపాతకాలమునుండి పారిపోతా ! పరుగెత్తుకొనిపోతా ! ఔను!
ఇప్పుడే—ఈక్షణమే—

(మోతి ప్రవేశం)

మోతి—అమ్మా !—అమ్మా !—

మెహ—ఎవరు ?—ఏమి?—

మోతి—మీ అన్నగారు ఆసఫ్‌ఖాన్‌జీ వచ్చియున్నారు

మెహ—కౌన్ ? ఆసఫ్ ?

మోతి—ఔను.

మెహ—క్యోంఆయా ? అచ్ఛా ! లేఆవో ! (మోతినిష్క్రమణం) (వెంటనే ఆసఫ్ ప్రవేశం)

ఆసఫ్—చెల్లీ ! నీసన్నాహం ఒకింతసేపు ఆపి ఒకవార్తవిను.

మెహ—తర్వాతవింటా ! ఆసఫ్ ! నీవురానేవచ్చావు ఒకపల్లకి మాట్లాడిపెట్టు బర్ద్వాన్‌కి—పో.

ఆసఫ్—మెహెర్ ! ఎందుకంత ఆందోళన ?

మెహెర్—అలాకనిపిస్తున్నానా ! మరేమీలేదులే—సరే ! ఏమిటావార్త ? మనసాయనకూడా నన్నుపంపించడానికి వస్తాడా ? మీ ఇద్దరిలో ఎవరోఒకరు నావెంట వస్తారనే అనుకుంటున్నా.

ఆసఫ్—మెహెర్ ! నేనువచ్చిన పని అదేదీకాదు.

మెహ—మరి ?

ఆసఫ్—నీదగ్గరకు సమ్రాట్టు పంపించగావచ్చా. ఆయనఒక్కసారి అయినానిమిషాలపాటు నీదర్శనంకావాలని కోరుతున్నాడు.

మెహ—నాదర్శనం ?—దేనికి ?

ఆసఫ్—నీకు తెలియదా ?

మెహ—అటులైనా !—సరే ! ఆయనకు ఆఉద్దేశ్యమే యింకనూ ఉన్నయెడల నాసలాములుచెప్పి నన్ను మరీ మరీ క్షమించవలసిందని నావిజ్ఞప్తిగా విన్నవించు.

ఆసఫ్—నీవు వెళ్ళబోయేముందు ఒక్కసారి నీదర్శనమైనా యివ్వకూడదా ?

మెహ—నహీఁ !

ఆసఫ్—మెహెర్ ! షేర్‌ఖాను పరలోకానికిపోయి ఇప్పటికి నాలుగేండ్లుగడిచిపోయాయి ఇస్లాంధర్మానికి స్త్రీ పునర్వివాహం వ్యతిరేకంకాదు. పదునాలేండ్ల దీర్ఘకాలంలో అంతవెంట ఆతని దినందినంబక్షీణించి అనంతకాల గర్భంలో అదృశ్యం అయిపోయినా, ఆ సమ్రాట్టు-హృదయంలో నీమీదఅనురాగం అచంచలమైన అనార్యగోళంవలె అప్పటికి యిప్పటికీ అదేవిధంగా ప్రజ్వలిస్తున్నది, కాని-నీకే_

మెహ—ఆసఫ్ ! ఆయనహృదయంలో నేనెట్లో నాహృదయంలో నాస్వామి యుఅట్టే !

ఆసఫ్—కాని, నీస్వామినీకు తిరిగిరాడుకదా-అనిగాక-

మెహ—ఆ ఉపదేశం నిష్ఫలం. నాసంకల్పానికి తిరుగులేదు. ఇకనీవు వెళ్ళవచ్చు.

ఆసఫ్—మెహెర్ ! కోటిమంది స్త్రీలలో ఒక్క స్త్రీకికూడ ఇట్టిఅవకాశం లభించుట అసంభవం సుమా !

మెహ—మీరంతాకలసి నన్నుపట్టేట దింపుటకు కట్టుకట్టారా? నాకువెఱ్ఱెత్తిం దాకా తలరా ? ఆసఫ్ ! నీవు ఎందుకువచ్చావు ఇక్కడికి ?

ఆసఫ్—వెళ్ళిపోతా! కాని ఒక్కవిషయం—పాదాక్రాంతం కాబోతున్న ఈసంప దను ఈపదవిని ఈ అధికారాన్ని నీవుస్వీకరిస్తే కలుగనున్న సుయోగానికీ, తిరస్కరిస్తే కలుగనున్న దుర్యోగానికీమధ్య ఎంతవిపరీత తారతమ్యంఉన్నదో ఒక్కింత ఊహించుకో.

సీ. కడువెల్ల వజ్రాల కాన్పుగా విలసిల్లు
గోలకొండ, నగలకొండ నీకు
లాహోరుతోట గులాబీలు జిల్కు ప
న్నీటి సోనల నోలలాట నీకు
అల యుధిష్ఠిరు దొట్టి యధిపులు మెట్టిన
మేటిగద్దియయైన చోటునీకు
ముక్తకంఠంబుల ముక్కోటి జనములు
పలుకు జేజేలు, మేల్కొలుపు నీకు
సతత జయశీల నిజభుజస్కంధ బంధ
బంధితసమగ్ర హిందూవసుంధరయందు
పడతి ! కొనగోటమీటు పూబంతినీకు
సాటియెవరింకనీకు స్త్రీకోటి ? లలన !

మెహ—ఆసఫ్ ! బికారిణినై బిచ్చమెత్తుకోడానికే నిశ్చయించుకున్నా.

ఆసఫ్—అయితే నీతోబాటు మాఅందరికీకూడా బికారీ ఉద్యోగమే ప్రాప్తిస్తుంది. ఎందుకంటే నీవుఅంగీకరిస్తే మానతండ్రికి ప్రధాన మంత్రిపదవి ప్రాప్తిస్తుంది. అంగీకరించకపోతే ఉన్న కోశాధ్యక్ష పదవికూడ ఉద్వాసన అవుతుంది.

మెహెర్—అర్థమైంది-అసఫ్! ఇదిదారుణసమస్య. నాశరీరాన్ని నాఆత్మనూ నాది అనిపేరు గర్విస్తున్న సౌశీల్య సర్వస్వాన్నీ ఒకసామ్రాజ్యహోమగుండంలో ఏకధారగా ఆహుతిచేయుటా చేయకపోవుటా ?—నాస్వామిని బలిగొన్న ఎవనివిద్రోహ కరవాల ధారవెంట నాహృదయంకూడ రెండుగాచీలి మానునిగాయంతో నేటికిని మరిగిపోతూ ఉందో వానిగళసీమకు కల్యాణ కుసుమ దామంకట్టుటా ?—కట్టకుండుటా!—ఇది కఠోర సమస్య !

అసఫ్—మెహెర్ ! నీశక్తి నీప్రజ్ఞ నీప్రతిభ నీకే తెలియక తప్పుత్రోవలో తారాడుతున్నావు. ప్రకృతి నిన్ను బాజారీ బికారిణిగా ఉద్దేశించలేదు. కోహినూరు వజ్రసగితమైన మహోజ్వల భారతకిరీటాన్ని శిరోలంకారంగా ధరించే ఒకలోకోత్తర నారీలలామగా ఉద్దేశించింది !

మెహెర్—ప్రకృతియో పిశాచమో, ఏదోఒకటి నన్ను 'రా! రా' అనిఇక్కడికి లాక్కొని వచ్చినట్లే కనబడుతోంది. లేకపోతే—

సీ. ఎన్నడో ఒకనాటి పున్నమ నగ్బరు
సార్వభౌముడు విందు సలుపనేల
సలిపెనుబో ! ఎల్లసభికులముందు నే
సిగ్గరి నృత్యంబు సేయనేల ?
చేసితిబో ! అనైచ్ఛికముగ నాముఖా
చ్ఛాదన ముడివీడి జారనేల ?
జారెబో ! ఆ జహంగీరు గాంచగనేల ?
గాంచెబో ! వలపున గరుగనేల
కరిగెబో ఏండ్లు పూండ్లయ్యు మరువడేల ?
మరువకున్నాడుపో ! ఏను మగనివెంట
దివికి పోనైతినేల ? నైతిపిమ్మేల ?
ఇటకురానేల ? కానేల ఇంతలీల !

హా హా హా ! తెలిసింది !--ఇందుకే !—విస్పష్టమైంది !--ఔను !—అవిశాధికే గెలుపు నాకేటికమి !--ఇకదాచను !-- దాచినా అదిదాగదు !—భావానికి రూపేవచ్చింది !—కళంకం !—ఇక వాక్కళంకానికి భయపడుటెందుకు ?

అసఫ్—చెల్లీ ! నా కేమీ బోధపడుటలేదు.

మెహ— ఇక బోధపడనట్లు !—ఆసఫ్ ! నీకూ నాయనకూ ఉండే ఏకాభిప్రాయమూ ?

ఆసఫ్— ఏకీ?

మెహ— నేను సమ్రాజ్ఞి కావడం.

ఆసఫ్— ఆఁ, ఇద్దరికీ ఒకేఅభిప్రాయం ! నీవు సమ్రాజ్ఞివి — నాయన ముఖ్య ప్రధాని — నేను ఖజాంచీ.

మెహ— సరే. నీ కోరికను నేనెందుకు కాదనాలి !— అట్లేయగుగాక !—

ఆసఫ్— ఏమిటీ !— నిజంగానా !— నా చెవులతో నిజంగా వింటున్నానా— మళ్లీఒకసారిచెప్పు !—

మెహ— కానీ— ఆసఫ్ !—

ఆసఫ్— ఇక 'కానీ' వద్దు— 'అయితే' వద్దు. నేను సరిగానే విన్నానులే — నీవు ఒప్పుకున్నావులే— ఇక వెళ్లివస్తా.

మెహ— ఉండు : ఒక్క ముఖ్యవిషయం యిందులో యిమిడిఉంది. విను ! వెళ్లిపోయిన తర్వాత ఒక ఆడపులిని బయటికి లాగిన ఫలితమేమగునో— ఎట్లుండునో — బాధ్యత మాత్రము నాదికాదు—

ఆసఫ్— ఇదంతావట్టిభ్రమ. అనవసర అనుమానం. ఫలితాలలో ఏ ప్రమాదమూ రానేరదు ...వస్తే నిర్వహించే బాధ్యతమాది సరేనా !

మెహ— సరే! అబ్ జావో! జాకర్ సమ్రాట్సే కహో ఉనసే వివాహ్ కర్నేకో మై తయ్యార్ హూఁ.

ఆసఫ్!— అచ్ఛా బహుత్ అచ్ఛా ! మెహెర్ ! నిన్ను మెహర్ అని పిలుచుటకు యిదే కడసారి. ఎందుకంటే నేటినుండి నీపేరు మెహెర్ కాదట! 'నూర్జహాన్' అనగా జగజ్జ్యోతియట ! సమ్రాట్ ఆదేశించారు. నీవు తప్పక అంగీకరిస్తావనే అచంచల విశ్వాసంతో ఆయన ఎన్నెన్నో ఏమేమో సిద్ధంచేయించి తానుకూడావచ్చి ఆపటాభ్యం తరువాత వేచియున్నాడు— ఇక నాకు సెలవా ? బందగీ నూర్జహాన్ బేగమ్‌సాహెబ్ బందగీ హింద్‌కీ అధీశ్వరీ ! బందగీ భారత్‌కీ సమ్రాజ్ఞి ! (వెనక్కు తిరిగి) కౌన్ హై ?

బజావో ! బజావో ! భేరీమృదంగ్ ! ఆవో దాస్ దాసీ ! గావో ! నాచో !—

(అంటూ ఆసఫ్ వెళ్లిపోతూయుండగా వలువైపునుంచి తూర్యారవాలు వినబడతాయి. వలుప్రక్కనుంచి దాసదాసీలు హారాలతో ఆహారాలతో ఉపహారాలతో నృత్యగానాలుచేస్తూవచ్చి నూర్జహాన్‌నుచుట్టిఅలంకారంచేయడానికిఆరంభిస్తారు. ఆదేవమయంలో జహంగీర్ ఒకచేతిలో కిరీటం పట్టుకొనివచ్చి నూర్జహాన్ శిరస్సునుఅలంకరిస్తారు. వందిమాగధులు ప్రవేశించి ప్రశస్తిచదువుతుంటారు ఇవన్నీ ఏకకాలంలో జరుగుతాయి.)

(తెర)

# అంకం మూడు

## దృశ్యం ఒకటి

(ఆగ్రామహాల్లో పీఠిన నర్తకి ఒకతె నృత్యంచేస్తుంటే వందిమాగధులు దానికి వంతపాడుతూ ఆడుతూ ప్రవేశం.)

### నృత్యగీతం

నర్తకి—ప్రీతమఆవో ! ప్రేమపిలావో !—
ప్రీతకె గీత సునావో !
ఐ లాసే మహరియార్‌కో రాత్‌కు షాదీహోనా !
ఆజ్‌రాత్‌కు షాదీహోనా !

మాగ—ఫిర్, హంక్యాకరనా ?—

వంది—జానా, పీనా, ఖానా, సోనా

మాగ—జానా పీనా ఖానా సోనా ?

వంది—హాఁ

నర్తకి—ప్రీతమఆవో, ప్రేమ—

వంది—నవఉత్సవకా రంగ్ చఢానా !

మాగ—నరనారీ సింగార్ బనానా !

నర్తకి—ప్రేమడోలికామే బిఠానా !
ఝూలాకే ఝూలనా ! ఝూలాకే ఝూలనా !
ఝూలాకే ఝూలానా !—
పృథివీసబ్ క్యాహై ?
ఏక్ ప్రేమకె నికుంజహై
ఇస్‌నికుంజమే క్యారహతీ ?
ఏక్ కోయిల కూకూకరతీ
ఇస్ గానామృతసే మస్ భర్‌భర్‌కే
దునియా సోజాతీ ! దునియా సోజాతీ !
దునియా సోజాతీ !—

(నర్తకి నృత్యంతో విశ్రమిస్తుంది)

వంది—మాగథ్ ! హెుట్కిరోజ్జానికీ హేమ్మిటెప్పాం? గ్యాపక్ వుంకా ? "వచ్చిందీరే వచ్చింది ! తురుష్క రాజ్యం తుకుచుకుపోయే తుపాను వచ్చింది !"

మాగ—హేమ్మిహైందీర! తైలాకు షహారియాన్కు ఫెల్లిహైంది. ఇస్మేతుపాక్ క్యాహై !

వంది—అరె ! గడ్డగూబకి జేటూ ! హిందౌక్టి షమాచార్ నీకీ తెల్వాశే ?

మాగ—క్యా షమాచార్ !

వంది—రే ! ఖుస్రూసాబ్ ఖూనీహువారే ! ఖూని ! ఖూని !

మాగ—(ఉలికిపడి) క్యా అ అ అ అ—

వంది—హాం-ఖుస్రూసాబ్ ఖూనీహువా !—

మాగ—ఖుస్రూసాబ్ఖూనీ !— కౌన్ కియా, కిదర్ కియా ? ఓఖుస్రూసాబ్ తమ్ముడు షాజహాన్ తోకల్సి దక్షిణ యుద్ధాన్కి పోయాడే అని హిన్నాం.

వంది—హాం హక్కా అర్ధరాత్రి ఢేరాలో నిద్రపోతూవుంటే, నిద్దర్ లోనే హైందీరే పెద్దనిద్ర !

మాగ—కౌన్ కియారే ఏఖూనీ ?

వంది—(రహస్యంగా) ఔర్ కౌన్ హై ? షాజహాన్ !—

మాగ—(రహస్యంగా) షాజహాన్ ! హాన్నా గొంతూ కొయ్యడాన్కి హాడ్కి షేతుల్ హైసావచ్చిందీరే !

వంది—హాడ్కి స్వయంగ సెయ్యలేదురే.

మాగ—ఫిర్ క్యారే ?

వంది—ఓబద్మాష్ గ్రాంపింహాంవుండాడే హాడ్కి ద్వారా సేయించాడ్ రే !

మాగ—గ్రాంపింహాం! (ఆలోచనతో తలపంకిస్తూ చిటికెలు వేస్తూ) హాం హద్దీ! మాకీ తెల్సింది ! హద్దీ !

వంది - క్యారే ?

మాగ—(కడురహస్యంగా) ఈఖూనీసేసింది షాజహాన్ హాడు కాదురే కాకు,

వంది—ఫిర్ కౌన్ ?

మాగ—(కడురహస్యంగా) నూర్జహాన్ !

వంది—క్యా అఆఆఆ !—

మాగ—హాం నూర్జహాన్ హుక్టిరోజా ఓ గ్రాంపింహాన్కి బులాకే, దర్వాజా బంద్ కే, పూరా అదాఘంటాతక్ హాడ్కే తో గుస్గుసా గుస్గుసా సేస్తూవుంటే మన్కి ఫెశ్వాం హాతీకాయ్ మానీ మాకీచెప్పింది.హాదేలోజ్ ఓగ్రాంపింహాం ఉదేర్తూర్ చలే గయా !

నంది—క్యా ! ఓ గ్రాంథింహంతో ఓ పతివ్రత్యార్ తో నూర్జహాఁ గుస్‌గుసా కియా !- బాప్రే ! తౌందు ! ఉందు ! మాకీహోక్తి హోలోవనా వచ్చిందే ! ఠీ ! మాగథ్ ! ఘుట్టిగా ఫట్కోమాకీ !

మాగ—క్యా ఆలోచనా ?

నంది—(రహస్యంగా) ఓనూర్జహాఁ, షైతాన్ బన్‌గయాహై షైతాన్ ! దాన్కి వృద్ధి రెండు మేకల్ బలి. మొదటి మేక ఖుస్రూ - రెండోమేక షాజహాఁ.

మాగ—ఫిర్ షహరియార్ క్యాహోనా ?

నంది—హాప్నా రాజ్యాన్కి హక్కుదార్ షహరియార్-అంటే లైలా అన్నమాట-అంటే నూర్జహాఁ అన్నమాటే !

మాగ—సచ్ హైరే సచ్ హై !

నంది—లేకపోతే-లైలాకీసూను పసునైశక్తి-శహర్యాక్కీసూను ఫసలేని శక్తి, ఈరెండు శక్తికీ శక్తికీ కల్పిందీహంటే ఓనూర్జహాఁ నేసింది షైతాన్‌కా కుట్ర!— (తెరవంక చూస్తూ) కౌన్ ! కౌన్ హై ! ర ! దేఖో ! మన్కి షైతాన్ మోతీబాయి దౌడ్‌దౌడ్ కర్కే ఆతీహై - క్యాహువారే ! బోలో ! క్యాహువా !—

(మోతి ఆయాసంతో పరుగిడుతూవచ్చి మాగఢుట్టి చేయిపట్టుకొని)

మోతి—రా ! అగ్రానుంచి పారిపోదాం ! రా ! ఆలోచించవద్దు ! రా !

మాగ—క్యాహువా ?

నంది—క్యాహువా ?

మోతి—ఇంకా మీకు తెలియదా! ఆగ్రాను ముట్టడించి జహంగీరునూ నూర్జహాఁనూ పట్టి ఖైదీచేయడానికి షాజహాన్ పెద్దసైన్యంతో వస్తున్నాడు. అతణ్ణి ఓడించటానికి, నమాశ్రిత్, మహాబత్‌ఖాన్ని పంపించాడు. పెద్ద యుద్ధం రాబోతుంది! రండి ! ఎవరి ప్రాణాలువారు దక్కించుకుందాం ! రండి !

మాగ—రే ! షాజహాన్ జిందా రహ్తాహురే రహ్తాడు !

నంది—మగర్ మోతీబాయ్! షాజహాఁ హిందూస్థా రహ్తాహు జిందా ?

మోతి—ఎందుకేమిటి ! ఖుస్రూను చంపించి షాజహానే అని అమ్మగారు అన్యాగాన్కి బాగాబోధచేసి నమ్మించింది. వెంటనే ఆవెఱ్ఱిమహారాజు షాజహాఁను ఖైదుచేసితీసుకురమ్మని అక్కడవున్న మరో సేనానాయకునికి రహస్యంగా ఆజ్ఞ పంపించాడు. అది ముందుగానే తెలుసుకొని షాజహాఁ ఒళ్లు మండిపోయి ఇగలా ఫలితేదని పూర్తిగా ధ్వజంఎత్తి తా నేసమర్పిట్టనికూడా ధంకావేయించి ఆగ్రామీదికి దండెత్తివస్తున్నాడు

నంది—(నగం సంగీతములో) "రక్తీకివచ్చిందిబాయీ ఈ రాజ్యాన్కి నాటకం

రంగైన నాటకం—రక్తికివచ్చింది" (అటూగంతులు వేస్తాడు)

మాగ—మగర్ బందీభాయ్! హాస్తూ మనం హొక్కడికి పోవాలా!

వంది—అరే! మనం హొక్కడికి పోవాలి? హొందుస్థాఁ పోవాలి? బత్రాజు ఆక్బర్‌కి బయం హెందుస్థా! హొజమురాజు హైతే వాడికి జండా పట్టి వాడికి పాట పాడదాం!

మాగ—ఠీక్ హైజీ! ఠీక్! నీకీఆలోచన బడీ వుంది.

వంది—(నవ్వుతూ) హాఁ దేఖో మోతీభాయ్! మాకీబుద్ధివుంది ఓ బుర్రపాస్తు తీసా బుద్ధీ!—మగర్ హిహిహి!—మా కీమీ ఏనికే—

మాగ—రే! హాల్గా హిశక్తి ఏఖా హాస్పావుత్తంటే మాకీ ఒళ్ళుఅంతా శరీరం హైపోతాది!—కపడ్ దార్!

వంది—తుంబోలా మోతీబాయ్! కౌన కపడ్ దార్! మై? ఉనో? హొక్కీ నీకీహస్తే హాదిమాకీ ఖరార్!

మోతీ—చెప్పనా? వాడు బూడిదకొందొల్లే గాడిద! నీవు కుండలునాకే కుక్కవు!—అంతేకాదు మీపురుషజాతి అంతాసిగ్గులేనిజాతే!

(తెర)

# అంకం నాలుగు

## రంగం ఒకటి

కాశ్మీరదేశంలో—సింధునదీతీరమైన విశాల ఒడ్డున నూర్జహాన్ జహాంగీర్ల యొక్కయు పరివారంయొక్కయు డేరాలు వేయబడియున్నవి. డేరాలకు దూరంగా కథకవేషాలతో వందిమాగధులూ మోతీయూ ప్రవేశము. పాట.

వంది-మాగ }
మోతి } అ అ అ అ అ అ అ అ హాజీ సునోజీ !

మోతి— మా రాజాలాటి రాజా లేడట, రాణీలాటి రాణీ లేదట—

వంది-మాగ— మోతీలాటి ముత్యం లేదట—

మోతీ—(వందిమాగధుల కేసి వేలు చూపిస్తూ) ఇద్దర్ నోటికిసుద్దీ లేదట

ముగ్గురూ— అ అ అ అ అ అ అ అ హాజీ సునోజీ !

మోతీ— జహాంగీరు పాదుషాకు మొన్నను జ్వరం తగిలెనండీ
మహారాణీ నూర్జహాను గారికి దిగుల్ కలిగెనండీ
స్థలాంతరానికి పొమ్మని వైద్యులు హితంచెప్పిరండీ
అదే ప్రకారం ఈ కాశ్మీరం అంతా వచ్చామండీ—

ముగ్గురూ— అ అ అ అ అ అ అ అ అ హాజీ సునోజీ !

మోతీ— షాజహాను చూస్తే మళ్లీ మేవాడుకు పరారు సుండీ
యోధమహాబ్బతు అగాధయోచన అదేమో తెలియదండీ
ఏక్షణమందున యేమిజరుగునో అగమ్యగోచరమండీ
ఇదిఅంతా యోచిస్తే గుండెలు గభేలు గుభేలు సుండీ—

ముగ్గురూ— అ అ అ అ అ అ అ అ హాజీ సునోజీ !

మోతీ— షాజహానుదే రాజ్యంహక్కని జహాంగీరు సుండీ
షహర్యారుదే రాజ్యంహక్కని సామ్రాజ్ఞి సుండీ
ఎవ్వరి పంతము జయించునోయని ఏల యడుగుటండీ
మగవాడంటే మగువచేతిలో మట్టిముద్ద సుండీ.

సహితంగా వస్తున్నాడా ? ఎంత స్వామిద్రోహం ! ఎంత దౌర్జన్యం ! బందీ ! పోయి పహారావాళ్ళతో చెప్పు! మాగధ్ ! నీవుపోయి సేనాపతి ఎక్కడున్నాడో వెతికి సమ్రాట్టు దగ్గరకు తీసుకురా ! నేనుముందుగాపోయి సమ్రాజ్ఞికి సమ్రాట్టుకు ఈవార్త చెప్పి సమర సన్నాహంచేయిస్తా. ఊ ! నడవండి !—

(ముగ్గురు నిష్క్రమణం)

సంగ్రాం— ఈ భట్రాజుపందలట ! సమరసన్నాహమట ! హా హా హా — అదుగో ! ప్రళయవాహినిలాగ మహాబత్ ఖాన్ సైన్యం ముంచుకొని వస్తున్నది. అది తెలియక సమ్రాజ్ఞీ సమ్రాట్టు చిదానందసాగరంలో ఓలలాడుతూ శిబిరంలోపడి వున్నారు. డేరాలకు కాపలావచ్చిన సైన్యంకూడా స్వల్పసంఖ్యాకం. అదైనా కత్తులన్నీ కడగా పెట్టి గంజాయికైపులో కన్నుగా నిద్రపోతున్నది. కాబట్టి సమ్రాజ్ఞీ సమ్రాట్టు మహాబత్ ఖానుకు ఖైదీలగుట నిశ్చయం. దానితో మొగల్ నిష్క్రమణం హిందూస్థాన ప్రవేశం నిర్ధారం. కాబట్టి, ఇకనుండి గాలివాటాన్ని గుర్తించి తెరచాపను తిప్పుకోకపోతే మునిగి డింకకొట్టడం నిస్సందేహం. అందుచేత ఇకఒక్కటే మనకు కర్తవ్యం. (అటూ కత్తి దూసి) జయహో మహాబత్ ఖాన్ ! జయహో హిందూస్థాన్ ! హర్ హర్ మహాదేవ్ !—

(నిష్క్రమణం)

## రంగం రెండు

విపాశానది ఒడ్డున సమ్రాట్ శిబిరంలో నృత్యం జరుగుతూ వుంది. నృత్యం నడుమ జహాంగీరుని వెంట పెట్టుకొని నూర్జహాన్ ప్రవేశం. జహాంగీరు చాలా బలహీనంగానే వున్నాడు. అయినా బలహీనతను ధిక్కరించి అతని ఆనందం యథావిధిగా ఉబుకుతూనేఉంది. ఆసనంలో కూర్చొని ఒకనిమిష కాలం నృత్యం ఆనందిస్తుంటాడు. మధువుఅందిస్తూ నూర్జహాను పరిచర్య చేస్తూవుంటుంది. ఇంతలో షహర్యారుప్రవేశం. మధువు అమచూ జహాంగీరు అతనిని గమనించలేదు. షహర్యారు నూర్జహాను వంకచూస్తాడు. ఆమె చిరునవ్వునవ్వి తలవూపుతుంది. షహర్యారుకు తన్నుపిలిపించిన పనియేమో అర్థంకాకపోయినా, ధైర్యం వచ్చింది.

షహ— సమ్రాట్ ! బందగీ !

జహా— హో షహర్యార్ ?

షహ— నాకు కబురు పంపించారా ?

జహా— హాఁ బేటా !— ప్రియతమా! ఇందాక నేనువ్రాసిన ఆష్ఫర్నామా యొక్కడ?- బేటా ! బైటో యహాఁ. (షహర్యారు మరో ఆసనం మీదకూర్చుంటాడు. ఇంతలో సేనా

మీదవున్న ఒకరత్నపేటికలోనుంచి ఒకకాగితంతీసి నూర్జహాను జహాంగీరుకు అందిస్తూ నృత్యం ఆపమని నర్తకీలకు సైగచేస్తుంది.) షహర్యార్ ! నీ అగ్రసోదరుడు ఖుస్రూ నాకంటేముందే వెళ్లిపోయాడు. రెండో అన్న షాజహానుకు, నేనున్నా లేనట్టుగానే కనిపిస్తున్నా. నీమూడో అన్న పర్వేజుకు జనానా ప్రపంచమేగాని జనప్రపంచం కనిపించుటలేదు. ఇక నన్నూ నాసామ్రాజ్యాన్నీ అనుసరించుకొని ఉన్నవాడవు నీవే కనపడుతున్నావు. కాబట్టి భావిభారత సమ్రాట్ పదవికి నీవే పాత్రుడవని నాకుతోచింది. ఇదిగో ఫర్మానా ! షహర్యార్ ! అందుకో ! రా యిటు !

షహ—(లేచి నూర్జహాన్ వంక చూస్తాడు. ఆమె చిరునవ్వుతో తలవూపుతుంది. ముందుకువచ్చి ఫర్మానాఅందుకొని బాదుగీ చేస్తాడు. ఇంతలో లైలా ప్రవేశం. అందరూ తెల్లబోతారు.)

లైలా—రాజకుమారా ! ఈకాగితంయేమిటి ? (షహర్యార్ చేతిలోని ఫర్మానా లాక్కొని చదువుకుంటుంది.) సమ్రాజ్ఞీ ! షహర్యారును అడ్డంపెట్టి ఇలాంటి తెర చాటునాటకం అవలంబించినంత అధోగతికి పాలైనారెందుకు ? ఈఫర్మానా నీపేరనే వ్రాయించుకుంటే ఎవరు కాదన్నారు ?—రాజకుమారా ! ఈసామ్రాజ్య సుడిగుండంలో ఒకఅన్నగారు పూర్తిగా అంతర్ధానమై పోయారు. మరొక అన్నగారు ప్రమాదకరంగా దానిచుట్టూ యీదపడి భ్రమణం చేస్తున్నారు ఈ యిద్దరి దుర్గతి యిట్లుకాగా మీరుకూడా దూకుతున్నారెందుకు ? సమ్రాట్ ! ఈఫర్మానా మీరు త్రికరణశుద్ధిగా వ్రాసింది కాదు. నాకుతెలుసు ఇదంతా ఆ పిచ్చివాణ్ని ఆడించుటకై మీరుచేస్తున్న అగాధ గూఢకుటిల తంత్రం. సమ్రాజ్ఞీ ! ఈఫర్మానాను నీవతీసికొని ఆషాజహానుతో నీవే యుద్ధంచేసి సామ్రాజ్యాన్ని నిలువబెట్టుకో ! (అంటూ ఆఫర్మానాను నూర్జహాను మీదికి విసిరివేస్తుంది). రాజకుమారా ! నగమానవుడు నరమానవుడు కాని వాడు సమ్రాట్ పదవికి అనర్హుడు. రండు. (అంటూ షహర్యార్‌తో నిష్క్రమణం)

జహా—(బిగ్గరగా నవ్వుతూ) హా హా హా (అంటూముఖము అనుతూ) నర్తకీయో ! నాచో ! నాచో !

(నృత్యం ఆరంభం)

నూర్జ—వృథా ! ప్రయత్నమంతా వృథా !

(మోతీ పరుగెత్తుకు వస్తుంది. దానివైఖరి చాలా భీభత్సంగా వుంటుంది. నృత్యంఆగి పోతుంది )

మోతీ—అమ్మా ! అమ్మా !

నూర్జ—ఏమే ! ఏమిజరిగింది ?

మోతీ—మహాబత్ ఖాను పెద్ద సైన్యంతో మనమీదికి యుద్ధానికి వస్తున్నారు. యుద్ధానికి !

నూర్జ—మహాబత్ ఖానా !

వంది—(పరుగెత్తుకుంటూ ప్రవేశించి) ఖుదావంద్ ! హోషియార్ ! హోషియార్ !

మాగ—(పరుగెత్తుకుంటూ ప్రవేశించి) జహాఁపనా ! జాగో ! జాగో !

వంది—ఖుదావంద్! మనకు జరిగింది మహాద్రోహం. హిందువులు అంటే మనకు కావలావున్న మన రజపూత్ సైన్యంకూడా రాజద్రోహం తల్పి ఏకదం ఫరారీఅయి మహాబత్ ఖాన్ సైన్యంతో ములాకాత్ హైంది.

మాగ—మనరజపూత్ సైన్యానికి హిందీద్రోహం బోధచేసింది ఓమారాణ్ జావా గాంగ్సింగ్

మోతీ—అమ్మా ! అమ్మా ! మీరు అయ్యగారి ప్రాణం మీ ప్రాణం రక్షించుకోండి ! రండి ! రండి !

నూర్జ—నోరుమూయ్! దాసీ! నీ దాసబుద్ధి నీకే ఉపయోగించుకో! పోయి నా యేనుగును సిద్ధంచేయించు. నేనే స్వయంగా నాయకత్వం వహించానని సర్వసైన్యానికీ తెలియచెప్పు. ఆ రజపూత్ బానిసలు పోయినమానె. మన మొగల్ సైనికులు వాడు వేలమంది వున్నారు. ఆ ద్రోహి మహాబత్తును శిక్షించుటకు ఆ సైన్యమే చాలును. పో! (మోతీ నిష్క్రమణం) వంది ! మాగధ్ ! మీ రాజభక్తికి చాలా ప్రశంసిస్తున్నాను. మీరిద్దరు ఇక్కడనేవుండి సమ్రాట్టుకు పరిచర్య చేయండి. సమ్రాట్ ! జంగ్ మైదాన్ జానేకా ఆజ్ఞ దీజియే.

జహా—(ఇంతవరకు జహాంగీరు తనపోవక్షాపాలను తనలోనే దాచుకున్నాడు) సమ్రాజ్ఞీ ! కానున్నది దారుణయుద్ధం. శత్రువో వీరమహాబత్. నీవు అబలవు. రణరంగానికిపోవుట చాలాప్రమాదకరం సుమా.

నూర్జ—[illegible] ! [illegible] ! ప్రభూ ! [illegible] అబలలు కారు స్త్రీలు.

సీ. సకలజగజ్జాల సంవర్ధమాన శ
క్తిస్వరూపిణులు మా స్త్రీలుగారె ?
పూజ్యసంసార సామ్రాజ్యసింహాసన
స్థితచక్రవర్తినుల్ స్త్రీలుగారె ?

ప్రేమమహాయజ్ఞ హోమకుండార్పిత
స్వీయసర్వస్వలు స్త్రీలుగారె ?
కుల సంఘ మత దేశ గౌరవరక్షణ
దీక్షానిబద్ధలు స్త్రీలుగారె ?
ధీరులన్ గన్న మాతలు స్త్రీలుగారె ?
జాలమింకేల ? చండప్రచండఖడ్గ
ధారిణీ మారిణీ ధాటి పోరుసలిపి
రిపులశిక్షింతు-లేదా ! వరింతు మృతిని !—

(కత్తిదూసి నిష్క్రమణం)

(వెలుపల రణదుందుభులు, ఫిరంగిమోతలు తీవ్రమైన రణసంరంభం)

వంది—ఖుదావంద్ ! హమ్మగార్కి ఏం ప్రమాదం వస్తుందో నని మాకి గడ్‌బడ్ గ్యాబా హైతాది.

మాగ—జహాఁపనా ! మేంకూడా హమ్మగారివెంట పోతాం ఆజ్ఞా దీజియే. (జహాంగీరు తలకడు.) (రహస్యంగా వందితో) క్యారే ! సమ్రాట్ ఏకదం చుప్ హోగయా. దివానా బన్‌గయా క్యా ?

వంది—(రహస్యంగా) దివానా నైరే. పూరాదిమాక్ హై. హికీమాంతా సచ్చీ సచ్చీ నాటక్ రే.

(ఖడ్గహస్తుడై మహబత్‌ఖాన్ ప్రవేశం, వెంట రణసింహుడుకూడా ఉన్నాడు.)

మహ—(నేపథ్యంవంక చూస్తూ) రాజపుత్రసైనికులారా ! చాలు! ఇక ఆపండి రక్తపాతం. రణసింగ్ ! నీవుపోయి యుద్ధవిరామానికి సన్నాహం చేసి, ముఖ్యంగా ఆశ్రైద్దున్న దేరావెలుపల పారాయిస్తూ నాఆజ్ఞకోసం యెదురుచూస్తూవుండు.

(రణసింగు నిష్క్రమణం)

మహ—సమ్రాట్ ! సేవకుని సలాములు.

జహా—నర్తకియో ! మహబత్‌ఖానోంకా స్వాగత్ గావో ! నాచో !

మహ—(నర్తకులను పొమ్మని గ్రుడ్లురుముతూ) ప్రభూ ! నాట్యప్రదర్శన సమీక్షకోసం రాలేదు నేను. (నర్తకులు పారిపోతారు.)

జహా—మరి ?

మహ—ఇంకోవిధంగా మీదర్శనం అలభ్యమని ఈవిధంగా లభింపజేసుకున్నా.

జహా—ఏమిటిసంగతి—సమ్రాజ్ఞికి క్షేమమా ?

ప్రభూ ! ఈమూడు అభియోగాలలో ఏఒకటి అసత్యమైనాసరే సమ్రాజ్ఞిని మీరుశిక్షింప నక్కరలేదు—

జహా—సత్యమైనయెడల ?

మహ—శిక్షింపక తప్పదు.

జహా—(మౌనం)

మహ—నాఅభియోగములు మూడును సత్యమేయని అంగీకరిస్తారా ?

జహా—(మౌనం)

మహ—కాబట్టి సత్యములేయని మీరంగీకరించినట్లే.

జహా—మహాబత్ ఖాన్ !—

మహ—ఈ మూడింటిలో ఒక్కొక్క అపరాధానికి దండన—మరణం !

జహా—సునో మహాబత్ ఖాన్ !—

మహ—సమ్రాట్ ! నేనువాదిని మీరు న్యాయాధీశులు. న్యాయమే నాకు కావాలి. న్యాయవిచారణమే మీరనుష్ఠించాలి.

జహా—(మౌనం)

మహ—ఈ అపరాధాలకు మరణమేయోగ్యదండనమని మీరంగీకరిస్తారా? లేదా?

జహా—ఔను.

మహ—అటులైన సమ్రాజ్ఞికి మృత్యుదండన విధించే ఆజ్ఞా పత్రం ఇదిగో. దీనిపై సంతకం చేయండి.

జహా—మహాబత్ !—

మహ—నహీ సమ్రాట్ ! నహీసోచ్నా-నహీడర్నా-నహీ ధర్మఘాత్ కర్నా.

జహా—తో-భీ-మహాబత్ !—

మహ—జహాఁపనా ! అప్ కౌన్ హై? రాజధర్మ్ కా విరాట్ స్వరూప్ హై! దుష్టోంకో శిక్షణ్, శిష్టోంకో రక్షణ్ ఆప్కా కర్తవ్య హై. మాతా పితా భార్యా బహిన్ ఇత్యాది మమతా బిల్ కుల్ ఛోడ్కే ధర్మరక్షణ్ కా కామ్ మే ఇన్సాఫ్సే. ఇమాన్సే జో కుచ్ కర్నా ఆవశ్య హై సబ్ కర్నా హై. సమ్రాట్ ! దీజియే దండనా ! కీజియే దస్తఖత్—(మహాబత్ ఆజ్ఞాపత్రం అందిస్తాడు మరుమాటచెప్పకుండా జహాంగీరుసంతకం చేస్తాడు.)

మహ—రణసింగ్........ (రణసింగుప్రవేశం)—ఈ పత్రాన్ని గొంపోయి మనశిబిరంలో వున్న సమ్రాజ్ఞికిచూపించి ఆజ్ఞనెరవేర్చు. (రణసింగు నిష్క్రమణం) ...... భారత సమ్రాట్టుల న్యాయవిచారణ ఇట్టుగనే ఉండవలెను ? ప్రభూ ! నిష్పక్షపాతంగా న్యాయంవిచారించుటలో జహాంగీరువంటి సమ్రాట్టు నభూతో నభవిష్యతి అనియావద్భారతం కీర్తించేందుకు నేడు అకీర్తికి అచంచలమైన ఉపాధియేర్పడింది.

(రణసింగు ప్రవేశం)

రణ—మరణించుటకుముందు ఒక్కసారి సమ్రాట్ దర్శనం కావాలని సమ్రాజ్ఞి అర్థిస్తున్నది.

జహా—(మహాబతువంక చూస్తాడు)

మహా—సమ్రాట్ దర్శనమెందుకు! పోయి అడిగిరా.

(రణసింగు నిష్క్రమణం)

మహా—జహాఁపనా! సమ్రాజ్ఞి మీసన్నిధికివచ్చి ఏవిధంగా మాట్లాడి మీమనసును మళ్ళీఎలామారుస్తుందో మీరుమాత్రంవెనుకటి ప్రేమాభిమానాలు విస్మరించి న్యాయ విచారమందే బద్ధమనస్కులై యుందురుగాకయని సేవకుని హెచ్చరిక.

(రణసింగు ప్రవేశం)

రణ—మరణించుటకుముందు పతిని దర్శించుటసతికిధర్మమని సమ్రాజ్ఞి సెలవిచ్చారు.

మహా—మంచిది. తీసుకురా.

(రణసింగు నిష్క్రమణం)

మహా—జహాఁపనా! ధైర్యం! తాముచేసిన ధర్మశాసనాన్ని తామేనిర్విఘాతంగా పాలించకపోతే ధర్మదేవత నిజంగా దిక్కుమాలినదై పోతుంది.

(రణసింగువెంట నూర్జహాను ప్రవేశం)

నూర్జ—ప్రభూ! ఈ సంతకంమీదేనా?

జహా—(మౌనం)

నూర్జ—అర్థమైంది. మొదటసందేహించా. ఇప్పుడునివారణ అయింది. ప్రభూ! నేనుస్వప్రాణరక్షణకోసం ప్రార్థించటానికిరాలేదు. ఎందుకంటే రానున్నమరణానికి నేనుజంకను. తామనసారాప్రేమించిన పురుషుడు తనమీదికేకత్తి నూరుకాంక్షించినపుడు నిజమైనప్రియురాలు ఆకత్తికోతనే కంఠమాలగాస్వీకరిస్తుంది. జహాఁపనా! నాకుమరణ దండన విధించుచున్న ఈ ఆజ్ఞాపత్రంమీద ఏచేతితో మీరు సంతకంచేశారో ఆచేతిని ఒక్కసారికన్నులకద్దుకోనిచ్చి ఆనంతరంనన్నుచంపండి (అంటూ జహాంగీరుచేయిపట్టుకొని కన్నులకద్దుకొనుటేగాక ముద్దుపెట్టుకుంటుంది).

జహా—నూర్జహాన్! ఆసంతకం నాదికాదుసుమా.

నూర్జ—మీదికాదా! మరెవరిది?

జహా—నూర్జహాన్! నీవుఎన్నోఅపరాధాలు చేశావు—నేనేమీఅనలేదు. నేను ఎక్కువగా ప్రేమించినఖుస్రూను హత్యచేయించావు—సహించియూరుకున్నా. ఆదిగులుతో జోధపురిఅసువులు చాలించింది—సహించియూరుకున్నా. అఖండసామ్రాజ్యం. [illegible]

కత్తి మీద పెట్టావు—సహించి ఊరుకున్నా. అంతవమానంలో ఉన్న నేను, ఇప్పుడు ఈ సంతకం చేసి ఉంటానని నీవెలా ఊహించావు? నూర్జహాన్! సంతకం చేసింది నా హస్తమే ననుట నిశ్చయం. కాని అక్షరాలు నావైనా, ఆజ్ఞ నాది కాదు! మహాబత్ ఖానది!

నూర్జ—(మహాబత్ ఖానువంక చూస్తూ) అర్థమైంది. మహాబత్ ఖాన్! నూర్జహానుకు మరణశిక్ష జహాంగీరు చేత వేయించి ప్రపంచంలో ఏమానవునకు సాధ్యం కాని మహా సాహసకార్యం అవలీలగా సాధించావు. నీవే గెలిచావు—నేనే ఓడిపోయాను. కాని నీవాడి! విజయగర్వంతో విఱ్ఱవీగు తున్నావేమో? అజ్ఞానం. ఎందుకంటే, నీవు గెలిచినది నీకు ఉజ్జియైన మరొక వీరపురుషుని కాదు. ఒక స్త్రీని అబలను! (జహాంగీరుతో) ప్రభూ! మీ ఆజ్ఞాపరిపాలనకు ఆలస్యం చేస్తున్నానేమో. క్షమించండి ఇక సెలవు. ప్రాణపతీ! సెలవు. సెలవు. ప్రియతమా! మేరే స్వామీ! మేరే ప్రేమ్‌కా దేవతా! ............

(అంటూ ఏడుస్తూ హెకరిస్తుంది.)

జహా—(నూర్జహానును లేవదీసి రొమ్ముకు అనించుకొని) ప్రియే! హాహా మేరీ జీవన్‌కా జ్యోతి! హాహా మేరీ జిగర్‌కా తారా!—

నూర్జ—నా ప్రేమదేవతా! మీ యనురాగప్రకాశమే నా మృత్యుపథాన్ని వెలిగించు గాక. ప్రాణపతీ! మరణానికి నేను జంకను! కాని జీవనం ఎంతమధురం! అయినా ఇంత ఆకస్మికంగా, ఈనాడే, ఇప్పుడే, ఈవిధంగా—(ఇక చెప్పలేక జహాంగీరు వక్షం మీద తలఆనించి ఏడుస్తుంది.)

జహా—(గద్గదికతో) మహాబత్!—

మహా—(మౌనం)

జహా—మహాబత్!—

మహా—ప్రభూ!

జహా—నీవు నాకు ఒకవరం ఇవ్వాలి.

మహా—నేనా! వరమా? మీకు!

జహా—చూడు! నూర్జహాన్ ఎలా ఏడుస్తున్నదో చూడు! మహాబత్! నేను కోరే వరం ఒక్కటే—నూర్జహానుకు ప్రాణభిక్ష!

మహా—ప్రభూ! విస్మరించితిరా? న్యాయం-ధర్మం-నియతి-

జహా—నూర్జహాన్ నా ప్రాణం! నా శ్వాస!

మహా—ప్రభూ! రాజ్యం-నీతి-పాలన-

జహా—నీతి! పాలన! మహాబత్! మనసులోని ఆనందజ్యోతి మాటుమణగిన తర్వాత ఈలోక ధర్మంతో ఈ లోకనియతితో ప్రసక్తియేమి?

మహా—ప్రభూ ! మానవత్వం మాది, మీది దేవత్వం.

జహా—సేనానీ ! నేను దేవతను కాను. ప్రేమకు పులకించి, ద్వేషమునకు మరిగి, విజయమునకు పొంగి ఓటమికి క్రుంగి, ఇంతలో నవ్వి, అంతలో వాపోవు ఒక దుర్బలమానవుడను నేను. మహబత్ ! కాఠిన్యం వద్దు. చూడు ! నూర్జహాన్ ఎలా ఏడుస్తున్నదో చూడు !

మహా—సమ్రాట్ !

జహా—వద్దు. మరి మాట చెప్పవద్దు. నా జీడోక్కలు.

మహా—మంచిది. రాజుకూడా మానవుడే అను విషయం విస్మరించుట నాదే పొరపాటు. సమ్రాట్ ! మీ కోర్కె యెట్లో యట్లే యగుగాక. సమ్రాజ్ఞీ ! ఇక మీకు విజయం అయింది. బేగంసాహెబా ! పంచమహాఖండములు ఏకమై వచ్చిపడినా సాధింపజాలని ఈ విజయమును తుదకు మీ కన్నీటి కణాలతో సాధించారు. సమ్రాజ్ఞీ ! నాడు సింహ దర్బారులో చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనుటకే నేను వచ్చాను. సమ్రాట్టు అర్థించకపోయినా, మీ ప్రాణం మళ్ళీ మీకు ఈయదలచుకున్నా, ఇచ్చాను. కృతార్థుడ నయ్యాను. ఇక సెలవు. కాని ఒక్క విషయం మరువకండి ! సమ్రాట్టు మీ యెడల చేసిన క్షాత్ర రక్తం తుదకు ఎట్లు నిష్ఫలమైందో, షహర్యారుకోసం వారు చేసిన సామ్రాజ్య నిర్ణయంకూడ అట్లే నిరర్థకం కాగలదని ముమ్మాటికీ విశ్వసించండి ! బందగీ సమ్రాజ్ఞీ ! బందగీ సమ్రాట్ !

(రణసింహుడు వెంటరా మహబత్‌ఖాన్ నిష్క్రమణం)

జహా—(పెద్దనవ్వు నవ్వి) ప్రియతమా ! కహాఁహై ఓ నాచ్నేవాలీ! కహాఁహై మేరీ మధూ ! ఆవో ! ప్యాలా భరావో ! రంగ్ చఢావో ! హా హా హా !

గీతిక

జగతీసబ్ కహతాహై (వచనం 'క్యాకహతాహై?')
జహాంగీర్ హోగయా దివానా !
జహాంగీర్ తో కహతాహై (వచనం 'క్యాకహతాహై?'
జగతీసబ్ హోగయా దివానా !.

నూర్జ—(మిక్కిలి ఆశ్చర్యంతో) ప్రభూ ! మీలో యిద్దరు జహాంగీరులున్నారా?

జహా—ఉండవచ్చు ! మోహినీ ! ఒక జహాంగీరు నీతో కలిసి చేసే అత్యుత్తమ కార్యాలన్నిటికీ, మరొక జహాంగీరు ప్రత్యేకంగా కూర్చొని విలపించకపోతే ఈ జీవిత నాటకానికి సార్థకమే భరతవాక్యం అయివుండేది !

(తెర)

## రంగం మూడు

ఆగ్రాకోటలో ఒకవీధి. సంగ్రాంసింగు ప్రవేశం.

సంగ్రాం—ఛీ ! ఛీ ! ఛీ !—మహబత్తు ఇంతపిరికిపంద అవుతాడని కలలో కూడా అనుకోలేదు.

సీ. రానేల దండెత్తి రజపూతసేనతో
బ్రహ్మాండ సమరసంరంభమెసఁగ ?
వచ్చెఁబో-భారత ప్రభ్వీయకా యానూర్జ
హానును ఖైదు సేయంగనేల ?
చేసెఁబో-తచ్ఛిరశ్ఛేదనమున కాజ్ఞఁ
బ్రభు జహాంగీరుచేఁ బడయనేల ?
బడసెఁబో-కొడుకు తద్బాష్పాంబుపూరాన
కరిగి కర్తవ్యంబు మరువనేల ?
ఉష్ణరుధిర స్రవంతులనోలలాడి
నట్టి మహబత్తు కటకటా ! తుట్టతుదకు
మగువకన్నీటి వరదలో మునుక వేసె !—
స్త్రీ, యబలయన్న కవి కేలసిగ్గు లేదు !

అనద, అసమర్థుడు, అప్రయోజకుడు ! తెలిసింది. మహబత్ ! నీకు తోడొల్ల—వెలిచేవ ! నీవీరత్వం పట్టి వేగిబీరకాయ ! అయ్యయ్యో ! ఎటువంటి అపూర్వతరుణం ! చివరకు ఎంత అపహాస్యం !—

శా. ఆనిర్భాగ్యవిధాతబుద్ధి యెటుబుగ్గైపోయెనోగాని, యి
స్త్రీ ! నేనే మహబత్తునన యొడ వేరేచెప్పనేలా? పరా
ధీనత్వంబును ద్రెంచి,హిందువులశక్తిన్ బెంచి, స్వాతంత్ర్యథం
కానాదంబు దిగంతరాంతర పరిక్రాంతంబుగాఁ జేయనే?—

అప్పన్న పట్టి యంప్పన్న. వానిసృష్టికి అర్థంలేదు ;

గీ. బుద్ధియున్నచోట భుజబలంబుండదు ;
యుక్తియున్నచోట శక్తిసున్న ;
రెండునొక్కచోట నుండుట కూర్పదు
"బమ్మ, వానికేమి రిమ్మతెగులో ?" !—

మహబత్ ఖానుచేత చావకుండ ఆనాడు జహాంగీరును తప్పించింది ఆ బ్రహ్మరే. ఆ జహాంగీరునే మళ్లీ ఇప్పుడు మూడు నెలలనుండీ మన్యజ్వరంతో పుంచంపట్టించింది ఆ బ్రహ్మరే. ఆ కనిదృష్టిలో మహబత్తుఖానుకంటే మన్యజ్వరం ప్రశస్తమని తోచిందా? అదుగో! రాచనగరంతా వైద్యులమయమైపోయింది. పాలకేలుపుపాడేలు_కనుపుపచ్చ హకీములు హామనచాయ భిషక్కులు-చూస్తే సమ్రాట్ జహాంగీరు మాపోరేపో స్వర్గయాత్రకు బయలుదేరేట్లే కనపడుతుంది. దానితో ఒకవంక సమ్రాజ్ఞీషహార్యార్లు, ఒకవంక షాజహా మహబత్ ఖాన్లూ ఒకరిమీద ఒకరు ఢంకా కొట్టుక తప్పదు. ఆ రెండు పక్షాలలో మనదే పక్షమో? !—తీవ్రంగా ఆలోచించాలి. (పోబోయి నేపథ్యంవంక చెవి ఆనించివింటూ) అదుగో! అదుగో! రోదనశరాళం నిండిపోయేటట్లు రోదనధ్వని ఆరంభమైంది రాచనగరులో. (మళ్లీ శ్రద్ధగా వింటూ) హరహరా! హరహరా! చలేగయా. సమ్రాట్ జహాంగీర్ చలేగయా. ఏక్‌దం ఉపర్ ఉడ్‌గయా. అచ్ఛా సమ్రాట్కీ ఆఖరిదర్శన కర్నే జావుంగా.

(నిష్క్రమణం)

## రంగం నాలుగు

శూన్యదర్బారు మంటపం. శూన్యసింహాసనం. సర్వం శూన్యం. తలవిరియ
బోసుకొని దీనవ్యరూపంతో ప్రవేశం నూర్జహాన్. వెంట మోతికూడావుంది—

నూర్జ—(అన్నివైపులా తేరిపార చూస్తుంది. శూన్యం. నిశ్శబ్దం.) హాయిరే! లోగయా! దర్బార్ హోగయా స్మశాన్! సింహాసన్ మే బైటాహై శూన్యసిరాకా! జగత్కా జ్యోతి జహాంగీర్ మిట్‌గయా! గయా మేరీఆశా! గయా మేరీశోభా! గయా మేరిసర్వస్వ!

మోతి—అమ్మా! మీరేఇలా అధైర్యపడితే, యింక మాబోటి ఆశ్రితులగతి ఏమి కావాలి? తల్లీ! ధైర్యం తెచ్చుకోండి!—ధైర్యం!

నూర్జ—ధైర్యం!—నేను ధైర్యంతోనే వున్నా! భర్తృమరణానికి నాకనులు కడిఅశ్రువులు రాల్చాయా?? లేదు _ నాహృదయం శతధా భిన్న భిన్నమైందా! లేదు—నాతనువు మొగలుసామ్రాజ్య మోడుపలె నేల్కూలిందా?—లేదు!-నిజం_! ఔను - కాదేనుమీ ధైర్యం. కాని మోతీ!—నాధైర్యాన్ని చూస్తే నాకే ఎందుకో భయం కలుగుతున్నది.

మోతి—ఎందుకు తల్లీ!

నూర్జ—ఇటువంటి ధైర్యం స్త్రీజాతికి అసహజమేమో!

మోతి—అమ్మా!

నూర్జ—లేక—నేను స్త్రీని కానా?

మోతి—ఎంతమాట!

(వంది ప్రవేశించి బందగీచేసి మౌనంగా ఉంటాడు.)

నూర్జ — వందీ! నాకుసంబంధించిన ఏదోఒక సరికొత్త అభాగ్యరేఖ నీముఖం మీద ముద్రితమై కనిపిస్తున్నది. చెప్పు! — ఎట్టి ఘోరవార్త వినడానికైనా ధైర్యంవుంది! చెప్పు! —

వంది — ఖుదావంద్! మహబత్ ఖాన్ గారి సహాయంతో షాజహాన్ సాహెబ్ గారు పెద్దఫౌజుతోవచ్చి మనఖిల్లాను ముట్టడిచేసి బడాజోర్ సే యుద్ధం షురూకియా.

మాగ — (ప్రవేశించి బందగీచేసి) ఖుదావంద్! మీఅన్న అసఫ్ గారుభీ, షాజహాన్ పక్షంలోచేరి మనమీద దాడి చేస్తున్నార్.

నూర్జ — అసఫ్ కూడా!

మాగ — జీ, హాఁ! అజ్ఞాదీజియే!

నూర్జ — అచ్ఛా! తుంలోగ్ జావ్! జాకర్ సబ్ ఫౌజోఁకో, సబ్ సిపాయిలోంకో బోలో, షాజహాఁసే యుద్ధ్ కర్నా! సామ్రాజ్య రక్షకర్నా! జావ్.

(వంది మాగధులు నిష్క్రమణం)

నూర్జ — మోతీ! నీవుపోయి షహరియారును వెంటనే పంపించు.

(మోతి నిష్క్రమణం)

నూర్జ — (చేతులు వెనక్కి కట్టుకొని తీవ్రయోచనతో అటూఇటూ పచారుచేస్తూ) భారతాధీశ్వరీ! నీవింకనూ సజీవురాలవై యున్నసంగతి ప్రపంచం మరచిపోయిందా? లేదు! — కాని నీశక్తి నిర్వీర్యమై పోయిందని ప్రపంచం భ్రమపడుతోంది. నిశ్చయం. అందుచేతనే, నీకుటుంబందే యింతనిర్భయంగా, ఇంత నిరాఘాటంగా విజృంభించింది! హాహా! రాణీ యోంకీ రాణీ! —

మ. కొనగోటన్ పువుబంతివోలె భరతక్షోణిన్ దుటారించి మీం
టినసీపైబడవచ్చునాప్పెనయదే! ఢిల్లీశ్వరీ! -చూడు! త
త్కన దుత్తుంగ తరంగమిక్కి జయనృత్యంబే ప్రదర్శింతువో!
వనితల్ దుర్బలలన్న సూక్తియె నిజంబై దానిలో క్రమ్మెదో!

షహ — (ప్రవేశించి బందగీచేసి) సామ్రాజ్ఞీ! నన్నుపిలిపించిన కారణం?

నూర్జ — షహర్యార్! మీనాయనగారు ఒక మరణశాసనంవ్రాసి నాకుయిచ్చారు. ఆ శాసన ప్రకారం ఈభారతవర్షానికి ఇకనీవే సమ్రాట్టువు!

షహ — నేనా! సమ్రాట్టు!

నూర్జ — కాని, నీతండ్రిగారి ఆశయానికి విరుద్ధంగా నీఅన్న షాజహాను ఈసింహాసనం కోసంవచ్చాడు.

షహ—రాకుండునా మరి ?

నూర్జ— మన సైన్యాన్ని, మన సేనా నాయకులను యుద్ధానికి పంపించాను. సమ్రాట్టువు కాబట్టి, నీవు సర్వసైన్యాధిపత్యం వహించి సంగ్రామం చేసి, షాజహానును నిర్జించి సింహాసనాన్ని రక్షించుకో -

షహ—యుద్ధమా ! నేను !

నూర్జ—మారుమాట చెప్పవద్దు ! వెళ్లు ! సత్వరం (వెలుపల రణభేరి నినాదం) షహ్ సునో షాజహాన్‌కా రణభేరీ సునో ! జావ్! అభీ జావ్ ! ఉస్ ద్రోహీ దుష్మనోంకో మారో ! ఖరాబ్ మారో !—

షహ—సమ్రాజ్ఞీ ! ఇదిమీ నిశ్చితాభిప్రాయమా !

నూర్జ—ఔను.

షహ—నేను నా అన్నతో యుద్ధంచెయ్యక తప్పదా ?

నూర్జ—తప్పదు. వెళ్లు-సత్వరం !

షహ—సరే, లైలా అంగీకారం కూడా తీసుకొని వెడతా.

నూర్జ—లైలా అంగీకారమా ? సమ్రాజ్ఞిని నేనుగాని లైలా కాదు.

షహ—పోనీ-ఆమెను ఒక్కసారి చూచి వెడతా.

నూర్జ—అందుకు మా యాజ్ఞలేదు.

(మళ్లీ రణభేరీ నినాదం)

షహ—ఆమెను మళ్లీచూస్తానో లేదో ?

నూర్జ—అధీరుడా ! శత్రుధంకానాదం చెవినిపడినంతనే కదంతొక్కుతూ కదన రంగానికి లంఘించటమాని జనానాలో కూర్చొని సల్లాపాలు చేస్తావంటావా !

షహ—సమ్రాజ్ఞీ ! లైలా నాతో ఏమిచెప్పిందో మీకు తెలియునా !

నూర్జ—నేను వినదలచుకోలేదు.

షహ—"మా అమ్మ" ఏకోఒక రాక్షసి ఆవేశించింది అందువల్ల ఆమె ఏమానవ కృత్యం చేయబోయినా చివరకది రాక్షసకృత్యంగా తయారవుతుంది" అని చెప్పింది.

నూర్జ—అదిఒక అజ్ఞురాలు—నీవొక అపాత్రుడవు.

షహ—సరే—మీకు కోపం వద్దు. తెలిసీ తెలియక ఏమన్నా భాషించాను, క్షమించండి. ఇక యుద్ధానికే వెడతా. సమ్రాజ్ఞీ ! సెలవు (పోతూ) లైలా ! నిన్ను చూస్తానో లేదో ? (నిష్క్రమణం)

నూర్జ— (పోతూవున్న షహార్యారువంక చూచి నవ్వి నిట్టూర్పు విడుస్తూ)

కాళచూస్తే ఓడు. వదిచూస్తే లోతు, తరుణోపాయం ! అయోమయం— —హాయ్యో నూర్జహాన్ ! నీకథ ఎంతలో ఎలామారిపోయింది ! — ఎంతలో ! —

సీ: దప్పికొంటివికదా తతమహారాజ్యాధి
కార సుధాపాన కాంక్షమరగి
జాయవైతివికదా జగదేకమండితా
ఖండల భారతమండలునకు
అనుభవించితికదా అఖిలజగత్తులో
ననితరస్త్రీలభ్య మగు విభవము
వెలయించితివికదా విశ్వగోళమునందు
యుగయుగంబులనిల్చియుండు కీర్తి

అట్టినీకథ యెంతలో పట్టువిడిచె !
పతికిమరణంబు—సుతకు నీపై శతంబు
అల్లు దనద—సేన యనాథ—అరుల బాధ !
భళిర ! ఏమాయె నీప్రజ్ఞ, భరతరాజ్ఞీ !

మోతీ— (ప్రవేశిస్తూ) అమ్మా ! రాజకుమారుణ్ణి యుద్ధానికి పంపించారా ?
నూర్జ—పంపించా !
మోతీ—అయ్యయ్యో !
నూర్జ— ......నోరుమూయ్ !
మోతీ—బాగా యోచించే పంపారా ?
నూర్జ—(ఉలికిపడి) ఏమన్నావే ?
మోతీ—బాగా యోచించే పంపారా అని.

నూర్జ—అంటే—నేను ఉన్మత్తురాలనైతినవేవార్త నీవరకూ వచ్చిందా ?
మోతీ—తల్లీ ! ఏఒక్కరిక్షేమంమీద మీమాతాపుత్రికల భావిజీవితమంతా ఆధార[illegible]వుందో, ఆ ఒక్కరినీ ఇంతఆనాలోచితంగా—అంత అపాయకరమైన ఘట్టంలోకి [illegible]పట అంత శ్రేయస్కరం కాదని నాచిన్నబుద్ధికి తోచింది.
నూర్—దాసీ !—

మోతీ—నేనుదాసీనే. కాని యజమానురాలి శ్రేయస్సుకోసం స్వప్రాణం అర్పించ దానికైనా సిద్ధపడి ఇంతనిర్భయంగా మాటలాడుతున్నా ! అమ్మా ! షహార్యారుగారి

సంగ్రామరంగంనుంచి వెంటనే పిలిపించండి ! మీక్షేమంకోసమే! మీఅభ్యుదయంకోసమే చెబుతున్నా—

నూర్—(మోతీ పూర్వోక్త సంభాషణచేస్తూవుండగానే నూర్జహాన్ ఒకకొరడాను వెతికిపట్టుకొనివస్తుంది ఆకొరడాతో మోతీనికొడుతూ) దాసీ ! బానిస ! బాందీ ! గులాం ! సమ్రాజ్ఞికి సలహాచెప్పేటంత సాహసంవచ్చిందా నీకు ?—నీకు!—నీకు—నీకు ! (అంటూకొట్టి మోతీని తరిమివేసి, కోపఘూర్ణిత మైన ఆ చిత్తావస్థలో చిందులుత్రొక్కుతూ) లైలా మొదలు దానివరకునన్ను వెర్రిదానినిచేసి గేలికి ఆరంభించారు ! —నాకువెర్రిలేదు ! లేదు ! లేదు !—ఇది దర్బార్ !—నేనుసమ్రాజ్ఞిని !—నా పేరునూర్జహాన్ ! నూర్—జహాన్—మూడక్షరాలు!—నిశ్చయం !—హి హి హి !—నాకట! వెర్రియట! వెర్రి !—

(లైలా ప్రవేశం)

లైలా—సమ్రాజ్ఞీ ! నీకునిజంగా వెర్రియెత్తింది, నీవువెర్రియెత్తిన ఆడుపులివి

నూర్—లైలా! (ఉద్రేకంఉబికి ఉబికివస్తున్నది, రక్తనపట్టుతో దాన్నినిగ్రహించుకొంటూ) లైలా ! నీకుకూడానేను ఆ ఆకారినయ్యానా ?

లైలా—నాభర్తను యెందుకుపంపించావు యుద్ధానికి ?

నూర్—యుద్ధంశౌరాచరితం పృథ్విలోఅభావపదార్థం కదా లైలా !

లైలా—మాభార్యాభర్తలకు అవసరంలేని యీ యుద్ధవ్యాసంగం నీకెందుకు ?

నూర్—మీకెందుకు అవసరంలేక పోయింది ?

లైలా—అన్యాయంఎల్లప్పుడు అనవసరమే !

నూర్—అన్యాయం ! నీనోటివెంట—ఈనాటికి—ఇట్టిమాట !—లైలా ! తల్లియెడల ద్రోహమా !

లైలా—ద్రోహమా ! నేను ? నీయెడల ?

నూర్—కాదామరి ? బెంగాల్ రాజవంశ నిర్మూలనంచేయడానికి అనాడునాచేత శపథంచేయించావు, నన్నుపిశాచినిగమ్మని ప్రేరేపించావు. నాకుచేదోడు వాదోడుగా వుంటానని వాగ్దానంకూడ చేశావు. ఇప్పుడుఇదంతా అనవసరమనీ-అన్యాయమనీ అంటున్నావు. న్యాయమా లైలా !

లైలా—ఔను. ఆనాడుఅన్నా. నిజమే. కాని—పిశాచకృత్యాలంత భీకరంగా—ఇంతజగత్ప్రళయంగా ఉండగలవనే ఊహ నాకప్పుడు తోచలేదు.

నూర్—మరి—ఇప్పుడుతోచినా ఇకఫలితంలేదు.

లైలా—లేదా ?—ఏం ?

నూర్—పాత్రధారణ పరిసమాప్తం కావచ్చింది. జీవిత ఖేలనం చిట్టచివరి ఘట్టంలోకి ప్రవేశించింది.

లైలా—అంటే—నావహారియాతుసుకూడా—

నూర్జ—ఔను, ఏ పైశాచిక బుద్ధిని నీవు నాయందు ప్రేరేపించావో, ఆ బుద్ధియే కంపించింది నీభర్తను యుద్ధరంగానికి. మరి—ఫలితం ఎట్లున్నదినో! — నేను ఏమానవ కృత్యం చేసినా చివరకు అది రాక్షసకృత్యంగా తయారవుతుందని నీవే అన్నావటకదా?

లైలా—ఔను, అందుకు సందేహమేమిువుంది?

నూర్జ—కాబట్టి—షహార్యారు విషయంలో మాత్రం అబద్ధమెందుకవుతుంది?

లైలా—అంటే? నాభర్తకు హానిరాగలదని తెలిసీ పంపించావా యుద్ధానికి?

నూర్జ—నీభర్తకు హానివస్తే నీకేమి లైలా?

లైలా—(తెల్లబోతుంది) అమ్మా! అమ్మా! నీమాటలు నీవైఖరి నాకేమో అనిర్వాచ్యమైన భయోత్పాతం కలిగిస్తున్నవి.

నూర్జ—బాలికా! నీసంకల్పం—నాసంకల్పం—ఘోర ప్రతీకారం? దారుణ ప్రతిహింస! మరచితివా? నీతండ్రి వధకు—నా షేర్ ఖాను హత్యకు—ప్రతిహత్య! వధి రాత్రులు! హా హా రవాలు! అనంతవిశ్వ విశ్వంభరా ప్రతిధ్వనిత రోదన ధ్వాన పరంపరలు!

లైలా—(వణికిపోతూ) అమ్మా! అమ్మా!—వద్దు!—ఇకవద్దు! విస్మరించు పూర్వగాధ! నిగ్రహించు నీ క్రోధం! అమ్మా!—

నూర్జ—అసంభవం!

లైలా—నాకోసం! నాకోసం! అమ్మా!

నూర్జ—నీకోసం! నీకోసం?—ఎవరునీవు?—నాకు తెలియదు! పో!— నా ఆవేశ్యకి ఈ లోకంలో నాకు ఒక్కరూ లేరు! పో—పో!—

లైలా—(అకస్మాత్తుగా తల్లిని గట్టిగా కౌగిలించుకొని మా! మా! మా! అంటూ ఏడుస్తుంది.)

నూర్జ—నహీ! మైతుమ్హారీ మా నహీ హూఁ! మైనూర్జహాఁ హూఁ!

లైలా—సహీ! మా! తుంమేరీ మాహో! మేరీ మా మెహర్! మేరీ మా మెహరున్నిసా!

నూర్జ—...... మెహెర్! ... మెహెర్!

లైలా—హాఁ! మైతుమ్హారీ బేటీహూఁ—అభాగినీ లైలా హూఁ

నూర్జ—మెహెర్! - లైలాకీ మా...

శైలా—అమ్మా! అమ్మా! నీకు నేనే దుఃఖం చేశాను. నిన్ను నేనే రెచ్చగొట్టాను. తప్పునాదే, తెలుసుకున్నా. కాని అమ్మా! పసిదాన్ని. లోకానుభవంలేదు. నాకు షహార్యారును భర్తగావిధించావు. అతణ్ణి మొదటమొదట గాఢంగా ద్వేషించా. కాని ఆయన యందుగల ఏదో ఒక అస్పష్టమానసిక సౌందర్యం నన్ను మారిమి చేసుకొంది. క్రమంగా ఆయనయందు అగాధ ప్రేమను అలవరించింది. అమ్మా! ఇప్పుడు నేను స్త్రీని—ప్రేమిని—అబలను! ఆయనలేకపోతే ఇప్పుడు నాకు జగమేలేదు. అమ్మా! నాషహార్యారును నాప్రేమమూర్తిని మళ్లీ నాకళ్లకు చూపించు — వెంటనే యుద్ధరంగంనుంచి ఆయన్నిపిలిపించు. అమ్మా!

నూర్—ఎవరక్కడ?

(మోతీ ప్రవేశం)

నూర్—మోతీ! శరవేగంగల అశ్వాన్ని ఆరోహించి, వాయువేగంతో షహార్యారును కలుసుకొని మనోవేగంతో ఇక్కడికితీసుకురా! ఊఁ! దౌడ్! నీకుగొప్ప బహుమానం.

(మోతీ నిష్క్రమణం)

నూర్—శైలా! మేరీప్రాణ్! మేరీసర్వస్వ! అనంద్ రహో! తుమ్హారీ స్వామీ తుంకో మిలేగా! అవశ్య మిలేగా

శైలా—మిలేగా? మిలేగా? మేరీస్వామీ మేరీప్రేమ్‌కాదేవతా మిలేగా? హాహా! ఆనంద్! ఆనంద్!

(ఆనందంతో కూనిరాగం పాడుతుండగా "అమ్మా! అమ్మా!" అంటూ మోతీప్రవేశం, దానిపిలుపూ దానిముఖభావమూ చూడగానే శైలాపాట శైలాగొంతుకలోనే ఆరిపోతుంది)

నూర్జ—ఏమే-

శైలా—ఏమిజరిగింది?

నూర్జ—మోతీ!-

శైలా—ఏదీ నాపతి?

నూర్జ—మాట్లాడు-

శైలా—మోతీ-

మోతీ—హత్యజరిగిందమ్మా!—హత్య-

శైలా—హత్య!-

నూర్—ఎవరు? ఎవరిని?

మోతీ—సంగ్రామసింహుడు-షహర్యారును-హ-త్య—

నూర్—సంగ్రామసింహుడు షహర్యారునా ?

లైలా—షహర్యారునా ?-నా షహర్యారునా !—హత్య ?

మోతీ—యుద్ధానికిపోతూవుంటే— సంగ్రామసింహుడు — వెనుకనుండివచ్చి—అయ్యగారిని పిస్తోలుతో కాల్చి—చంపివేశాడట ! వందిమాగధులు ఆయనను మోసుకొని వస్తున్నారు ! అదుగో !

(వందిమాగధులు షహర్యారును మోసుకొనివచ్చి దింపుతారు. షహర్యారు ఒంటినిండారక్తమే. ఇంకాకొనవూపిరివుంది.)

లైలా—హాయిరే ! మేరేస్వామీ ! (అంటూఅతనిమీద పడిపోతుంది)

షహ—లైలా ! నన్ను చంపిన సంగ్రామసింహుణ్ణి — నేనుతిరిగి — చంపలేక పోయినా—వాణ్ణి—పట్టుకొని— పెనగులాడి — చివరకు ఆ యుద్ధంలాక్కొని—తీసుకువచ్చా ! — చూడు ! (అంటూ పిస్తోలును లైలాకుయిస్తూ) లైలా ! నేను నీ వనుకొన్నంత—అసమర్థుడను—కానునుమా ! (నవ్వుతూ)—సెలవు ! లైలా !—సెలవు!

(మెడ వాలిపోతుంది. మరణం.)

లైలా—(షహర్యారును తేరిపారజూస్తూ) గయా ! గయా ! మర్‌గయా ! మేరేస్వామీ ! మేరేదేవతా ! — అచ్ఛా ! అబ్ క్యాకర్నా ? — క్యాకర్నా ? (పిస్టలుకేసి తదేకదృష్టితో చూస్తూ) హహహ ! — క్యాకర్నా ! — మర్నా ! — మర్నా ! (పిస్టలు తనకేసి గురిపెట్టుకుంటుంది)

నూర్జ—లైలా ! లైలా ! —

లైలా—మర్నా ! (పేల్చుకొని షహర్యారుమీదపడి చచ్చిపోతుంది.)

నూర్జ—లైలా ! — లైలా ! — లైలా (అంటూ లైలామీదపడి దేహమంతా తడిమి చూస్తుంది.) గయా ! లైలాభీగయీ ! సమాప్త్ ! సమాప్త్ ! (లైలాచేతిలోవున్న పిస్టలు తీసుకుంటుంది) సమాప్త్ ? సమాప్త్ హెనేకో అభీ ఏక్ హత్యా బాకీహై ! ఆత్మహత్యా ! సంగ్రాం ! ఏబందూక్ తుమ్హారీహై ఔర్ అచ్ఛీమారీ హై !— (పిస్తోలు తననుండేఅకు గురిపెట్టుకుని) మేరే షేర్‌ఖాన్‌కో, షహర్యార్‌కో, లైలాకో, జైసాతుమ్ మార్‌దియా వైసాముఝ్‌భీ మారో ! (పిస్టలు పేలదు.) మారో ! (రెండవ సారికూడా పేలదు. దానిలో గుండ్లు అయిపోయినవి.) మారో ! తుం మారో నహీంహై క్యా ?— హి హి హి — తూ అచ్ఛీ మారీహై ! మగర్ తుంసే బడీమారీ హైహై ! ఇస్‌లియే డర్ ధర్ వాలేకే తుమ్ తుమ్హారీకామ్ బిల్‌కుల్ భూల్‌గయా ! అచ్ఛా !

ఏకామ్ తుంనే నహీ హోనదోగే తో, మైతుమ్హారీ మాలిక్ కా పాస్ జావుంగీ ! ఉన్సే ఆవశ్యహోగా! జావ్ తుం! (విసరిపారేస్తుంది) సంగ్రాం ! సంగ్రాం ! కహాఁహో తుం ? కహాఁహో !— ఆవో ! ఆవో ! మై అకేలీహుఁ !ఆవో ! మగర్ - దేఖో ! తుమ్హారీ కమాలీబందూక్, మేరే ప్రియజనోంకే ప్రాణోం కో ఖా ఖాకే పేట్ భర్ కే ఏక్ దమ్ సోగయా! ఉస్ లియా ! లావో ! దూస్రాబందూక్ ! దూస్రా నహీహైతో, లావో లాఠీ ! లావో పత్థర్ ! లావో కుచ్ ! లావో ! మారో మారో ! మారో !— మారో !

(అంటూ పోతూవుండగా ఒక స్తంభానికి మొగం కొట్టుకొని నెత్తురు పారుతుంది.)

( తెర )

## రంగం ఐదు

కోటవెలుపలి ప్రాకారంవద్ద రణమైదానంలో ఒకదృశ్యం

(ఖడ్గహస్తులైన ఆసఫ్‌ఖాను, షాజహాను ప్రవేశం.)

ఆసఫ్—రాజకుమారా ! కోటలోపలి క్రొత్తవార్తలువిన్నారా ?

షాజ—ఏమది !

ఆసఫ్—సమ్రాజ్ఞి నూర్జహానుకు పిచ్చియెత్తినదట !

షాజ—పిచ్చి ! సమ్రాజ్ఞీకా ?

ఆసఫ్—సంగ్రామసింహుడు షహార్యారును హత్యచేశాడట !

షాజ—షహార్యారునా ! హాయిరే కంబఖ్త్ నసీబ్ భాయీ !

ఆసఫ్—షహార్యారుమరణానికి సహింపలేక లైలా ఆత్మహత్యచేసుకుందట ! [illegible]అందుచేత సమ్రాజ్ఞీకి గతిపోయింది, కాబట్టి మతికూడా పోయివుంటుంది!—

షాజ—ఎంతటి దుస్థ్సితి—

(అంటూవుండగా మహాబత్‌ఖాను ఖడ్గహస్తుడై కతిపయపరివారంతో ప్రవేశం)

మహా—భారత్ సమ్రాట్ షాజహాన్కీ జయ్‌హో ?

అందఱు—భారత్ సమ్రాట్ షాజహాన్కీ జయ్‌హో !

మహా—జహాఁపనా ! సంగ్రామం పరిసమాప్తమైంది. హతశేషమైన శత్రుసైన్యం మనశరణుజొచ్చింది. విజయలక్ష్మి పూర్తిగా కైవసమైంది. ఇకదుర్గప్రవేశం, సింహాసనారోహణం, మిగిలియున్నవి.

అందరు—భారత్ సమ్రాట్ షాజహాన్‌కీ జయ్‌హో !

(అంటూవుండగా చచ్చినబత్తైదూడవలె సంగ్రామ సింహుని కర్రకువ్రేలాడ గట్టి మోసుకొని ప్రవేశం వందిమాగధులు. సంగ్రామసింహునిదింపుతారు, కట్లువిప్పుతారు, దుమ్ము దులుపుకుంటూ సంగ్రామసింహుడు లేచినిలబడతాడు)

వంది—బందగీజహాఁపనా ! షహర్యార్ సాబ్‌కా ఖూనీ సేకింది, ఈ హరాంజాదా!

మాగ—హడ్డీకా పట్వారీ అని బడీఖుషీసేలాం జహాఁపనా !

వంది—హాల్‌కా కోసం ఫిల్లిలాగ హాథ్‌కా హాత్‌కా బేజార్ హయ్యాం జహాఁపనా!

మాగ—ఆఖేర్‌కా హాట్కీజాగాలో వాసనాపట్టాం జహాఁపనా !

వంది—సల్గాసల్గా హాత్కా హాన్కా చేరి మారెండు తలపాగాల్ కల్పి, తాడులాగ చేసి ఏక్ దమ్ హిసిరీయేసి, హడ్డీకా కాళ్లురెండు గట్టిగాబిగించాం జహాఁపనా !

మాగ—హడ్డీవదున్నాలాగా హాంద్రుం హాంద్రుంకర్కే ఏక్ దం నేలాఖోలి బోర్లపడ్డాడ్ జహాఁపనా !

వంది—హప్డూర్ఝుట్‌న హీప్రూమీద హాక్కే మాలీమీదఖోట్టి ముక్యాకా సేలరాని కాళ్లగీళ్లు నేతుల్ గీతుల్ తక్కడ్‌సే బందోబస్త్‌కర్కే సచ్చిపోయిన బత్తెమూడాలాగా ఈ లక్డీకీ ఖట్టీతెచ్చి హుజూర్‌కే సామ్నే హాజర్ చేశాం జహాఁపనా!

షాహ—అమూల్యమైన మీ సేవకు మా ప్రశంస.

వంది } బందగీ
మాగ }

షాజ—సంగ్రాం ! షహర్యారుయెడల ఆరాత్మన కృత్యం చేసింది నీవేనా ?

సంగ్రాం—నేనే జహాఁపనా !

షాజ—ఎందుకు చేశావు ?

సంగ్రాం—మీకోసమే జహాఁపనా.

షాజ—సంగ్రాం ? ! —

సంగ్రాం—ఔను. మీకూ మీ సింహాసనానికీమధ్య ఎన్నటికీ ఏ అంతరాయమూ రాకుండా మార్గంలోవున్న ముండ్లన్నిటిని ఏరి తూరి తొలగించి పారేశాను జహాఁపనా.

షాజ—మరికొన్ని ఘోరాలుకూడా చేసివచ్చారేమి ?

సంగ్రాం—మీయన్న ఖుస్రూగార్కి ఇద్దరు కొడుకులున్నారుకదా జహాఁపనా! ఆయిద్దరినీ ఇంతకుముందే సఫాచేసివచ్చాను. మీతమ్ముడు పర్వేజ్‌గారికీ మరొక ఇద్దరు కొడుకులున్నారు—వారినికూడా నిశ్శేషం చేశాను జహాఁపనా ! మీ తోవలో ఇక పూచిక పుల్లకూడాలేదు—సాఫ్ ! బిల్‌కుల్ సాఫ్ !

షాజ—అరరె! కైసా భయానక్ హత్యాపరంపరా! కైసావికాస్‌కా భీభత్స నర్తనా! సంగ్రాం!—

సంగ్రాం—జహాఁపనా!

షాజ—నేనింకా నమ్మజాలను. ఈ హత్యలన్నీ నీవు నిజంగా చేశావా?

సంగ్రాం—నా ప్రభువుకు నే చేసిన అమూల్యసేవను కప్పిపుచ్చుకోవలసినంతకష్టం నాకేమి వచ్చింది జహాఁపనా!

షాజ—తుచ్ఛుడా! నీవు చేసిన యీహత్యలన్నిటిని ఆమోదించి, హర్షించి, నిన్ను బహుమానింపగలనని ఊహించితివా? —— నీవుమానవుడవు కావు! దానవుడవు! సంగ్రాం! ఈ లోకంలోగల శిక్షలలో నీకేది అర్హమో నాకు స్ఫురించుటలేదు. వందిరి. వందీ! మాగధ్! ఏ పిస్తోల్ లేజావ్! ఇస్ పాపీకో బాహర్ లేజాకే గోలీసే మార్ దో!

(వంది పిస్తోలును అందుకుంటాడు)
(వందిమాగధులు చెరొకచెయ్యీ పట్టుకొని సంగ్రామును ఈడుస్తారు)

సంగ్రాం—జహాఁపనా!

షాజ—చుప్—

సంగ్రాం—నా సేవకు ఇదా బహుమానం?

వంది—ఆవుజీ రాజాసాహెబ్!

మాగ—చలోజీ గ్రాం సింగ్‌జీ!

సంగ్రాం—అరరె! అమహారాష్ట్ర అప్పుడే వ్యాపారం మానుకొని ఈ మహారాజుల సేవలోకి మరిపోయి దిగానుకన్నా!

(వందిమాగధులు సంగ్రామును లాక్కుపోతారు)
(తెరలో, గుండుప్రేలిన శబ్దం వినిపిస్తుంది)

షాజ—మామాజీ! ఇక దుర్గ ప్రవేశము చేయుదమురండు. మహాబత్ ఖాన్‌జీ! నావిజయానికీ, నా అభ్యుదయానికీ, నా జీవితానికి కూడా మీరే మార్గదర్శకులు. దుర్గ ప్రవేశంలో మొదటి అడుగు మీచేత పెట్టించి మీ యెడలనాకుగల భక్తిని కొంతనైన ప్రకటించుకొని తృప్తిపొందెదగాక. ఖాన్‌జీ! ముందునడవండి!

అందరు—జయహో! హిందూకా సమ్రాట్ షాజహాన్‌కీ జయ్‌హో!

(నిష్క్రమణం)

కిరీటం కనిపిస్తుంది.) ఏ క్యా హై కిరీట్? తుంకో కైసా మిల్‌గయా ఏ కిరీట్? కౌన్ హై తు? — కహో! — తుం రాజకుమార్ హో? — (మహాబత్‌ను పరీక్షచేస్తూ) రాజకుమార్! తుం! ఇహీ! కహీ! ఏ కిరీట్ తుమ్హారే కహీ హై లావ్ ఇధర్, లావ్ (అంటూ మహాబత్ ఖాన్ చేతిలో కిరీటం తీసుకోబోతుంది. మహాబత్ షాజహాన్‌వంక చూస్తాడు. షాజహాన్ తలవూపుతాడు.) లావ్! (మహాబత్ ఇస్తాడు. కిరీటాన్ని తదేక దృష్టితో పరీక్ష చేస్తుంటుంది.)

షాజ—సమ్రాజ్ఞీ!

నూర్జ—సమ్రాజ్ఞీ! కౌన్ హై సమ్రాజ్ఞీ!

షాజ—ఆప్!

నూర్జ—మై? హాఁ హాఁ — జరూర్! మై సమ్రాజ్ఞీ హూఁ — సమ్రాజ్ఞీ అచ్ఛా — సమ్రాజ్ఞీసే తుంకో క్యా హోనా? — కహో!

ఆసఫ్—బహెన్!

నూర్జ—బహెన్! తుం కౌన్ హై! — బహెన్! తుమ్ మేరా భాయీ హో! ఝూట్! బిల్‌కుల్ ఝూట్! మేరా భాయీ ఏక్ చోర్ హై! — నమక్ హరామ్ హై ఓ మర్ గయా! — జావ్!

మహా—సమ్రాజ్ఞీ!

నూర్జ—హాఁ హాఁ! మై సమ్రాజ్ఞీ హూఁ! సమ్రాజ్ఞీ!

మహా—ఆజ్ షాజహాన్‌కో కిరీట్ ధారణ్ హోనా!

నూర్జ—కిరీట్ ధారణ్ హోనా! అచ్ఛా! అచ్ఛా! కహాఁ హై షాజహాన్? షాజహాన్—

షాజ—మా!

నూర్జ—మేరే పాస్ ఆవ్!

షాజ—మా! (దగ్గరకువస్తాడు.)

నూర్జ—తుమ్హారా నామ్ షాజహాన్!

షాజ—హాఁ మా!

నూర్జ—తుం సమ్రాట్ బన్‌గయా? — అచ్ఛా! — తో ఆవ్ మేరే సాథ్

(అంటూ సింహాసనం వంకకు పోతుంది.)

షాజ—పాగల్‌పన్ మే భీ ఏక్ పంథా హై! (అంటూ నూర్జహాన్ వెంట సింహాసనం వద్దకు వెళ్తాడు.)

నూర్జ—ఆవ్! బైఠో యహాఁ (అని సింహాసనం చూపిస్తుంది)

షాజ—(సింహాసనంమీద కూర్చుంటాడు)

నూర్—దేఖో ! జవాబ్-క్యా ? భూల్‌గయీ-తుమ్హారానాం క్యాహై ? హాఁ_షాజహాన్ ! షాజహాన్. అచ్ఛా! షాజహాఁ! తుమ్హారీకిరీట్ ధారణ్ మేరీహాత్ సే హోనా తుఝే అంగీకార్ హై !

షాజ—హై మా.

నూర్—తో శిర్ ఝుకో.

షాజ—(తలవంచును)

నూర్—(కిరీటంనెత్తి మీదపెట్టి సంతోషంతో చప్పట్లుకొడుతూ) హ హహ హా బోలో ! అబ్ బోలో ! సమ్రాట్ షాజహాఁకో జయ్‌హో !

అందరు—సమ్రాట్ షాజహాన్‌కీ జయ్‌హో !

షాజ—(సింహాసనముమీదనుండి లేచి) అమ్మా ! నాకనుగ్రహముగా ఈ ప్రక్క ఆసనంలో మీరు ఆసీనులై, నాకంప్రదించిన పవిత్రవస్తువును నమ్రభక్తితో పూజించ నిండు !

నూర్—భూల్‌గయీ. కహాఁహై మేరీ శైలా ? కహాఁహై మేరీ దాసీ ?

షాజ—ఇదిగో మీ శైలా (అంటూ తొట్టిబొమ్మతో సహా స్వయంగా పట్టుకవచ్చి నూర్జహానుకు అందిస్తాడు. ఆ బొమ్మను ఒడిలో పెట్టుకొని నూర్జహాను ముద్దాడుతూవుండగా) అమ్మా ! మీకు మీ శైలాకు ఇదే ఆహ్వానము, ఇటు, ఇటు (అంటూ ఆమెను సింహాసనం ప్రక్కనున్న మరో ఆసనంమీద కూర్చోపెట్టి, ఆమె పాదాలను కనులకు అద్దుకుంటాడు. పిచ్చిఆనందంతో నూర్జహాఁ నవ్వుతూ శైలాను చేతులలో ఊపుకొంటూవుంటుంది)

షాజ—(ఆదేశమయంతో) బోలో ! మొగల్‌రాజ బంధ్‌కీ మాతా నూర్జహాఁకీ జయ్‌హో !

అందరు—మాతా నూర్జహాన్‌కీ జయ్‌హో !

నూర్జహాన్ కూడా చప్పట్లుకొడుతుంది

మహా—సచివసామంత దండనాథులారా ! భారతహిందూ ముస్లింసోదరులారా! మహత్తరమైన ఈ చారిత్రక సమయమందు మహాత్మా అగ్బరును మనసారస్మరించి, నానుడువబోవు విజ్ఞప్తిని చనువుతో ఆలకింతురు గాక.

సీ. పల్లకియొక్కటే; పల్లకిలోనున్న
దేవతయొక్కటే — దేశమాత.
బోయీలుపుత్రులే; పుత్రులు నిర్వురే;
ఒకడుహిందువు, మరియొకడు ముస్లిం
ధీరహిందూభాయి ! వీరముస్లింభాయి !
పల్లకి మోసెడిపద్ధతి విను !
ఒకమాట యొకపాట యొకశ్రుతి యొకగతి
ఒకచూపు ఒకలక్ష్య మొక్కటే తెరువు

అదిమొపద్ధతి-అదియెకల్యాణసిద్ధి
అన్న హైందవ ! భాయీ మహమ్మదీయ !
కన్నులవిరెండు వేర్వేరయున్ననేమి ?
కలిసిచూచెడి దృష్టి యొక్కటియెసుమ్మ !
అందరు— జయ్‌హో ! హిందూముస్లింకీ జయ్‌హో ! (కరతాళధ్వనులు)

(మంగళగీతం)

— సమాప్తి —

లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి. కా. 1000—12—48

# నేటినటుడు వగైరా ★ ★ ★

[మూడు ఏకాంక నాటికలు]

రచయిత : కొప్పరపు సుబ్బారావు

వెల : ఒక రూపాయి    ది మోడరన్ పబ్లిషర్స్ (రిజిష్టర్డు) తెనాలి

— * అభిప్రాయాలు * —

"మీరు వ్రాసిన 'నేటినటుడు' ఉత్తమ నాటకరచనా విధానాన్ని సూచిస్తున్నది.' —టి. రాఘవ, బళ్ళారి.

"సుబ్బారావుగారి రచనలో—ఇచ్చిన సలహాల్లో—ఎంతో దూర దృష్టీ, పరిణతా, ప్రతిభా కనబడుతున్నవి." —ఆంధ్రపత్రిక

"సుబ్బారావుగారి కలం, అనుభవంచేత ఇందులో సానదేరింది. ప్రదర్శింప బడినట్లయితే, ఈమూడునాటికలున్నూ సంఘానికి ఏదో రూపంలో కొరడాదెబ్బల వలె తగులక మానవు." —ప్రజామిత్ర

"సుబ్బారావుగారు తెలుగుదేశంలో ప్రజామోదంపడసిన నాటక రచనలో సిద్ధహస్తుడు. ఆనేర్పరితనమే ఈనాటకాలలోకూడ కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది." —ములుకోల

"This publication is of a high literary order. It is vigorous writing all through. The book is instructive as well as enjoyable"

—HINDU

"These playlets are very well written and do great credit to the author who is out to expose social evils through his writings."

—SADHANA

The first 'The Present day Actor' is an interesting instructive bold and bright satire. The second 'Confession' is in high classical style reminiscent of the ancient Gupta period. The third 'The Robinhoods' an Opera, is the most telling satire ever written in Telugu, on the fables of the present day on the economic inequilibrium of society."

INDIAN EXPRESS